శ్రీరస్తు.

శ్రీ

# మదనసాయకము.

( 5 అంకముల నాటకము. )

గ్రంథకర్త

అల్లంశెట్టి అప్పయ్య కవిగారు

పొందూరు. (విశాఖపట్టంజిల్లా)



పబ్లిషర్

కె. ఆంజనేయులు, చెవెండ్ర

వల్లూరి శ్రీ పద్మనాభ రాజుగారి స్వకీయ

ఆల్బర్టు పవర్ ప్రెంటింగు వర్క్సు నందు

ముద్రింపఁబడియె.

కాకినాడ.

1925.

 వెల రు. 0—12—0

# పీఠిక.

---

మహారాజశ్రీ అల్లంశెట్టి అప్పయ్యకవిగారిచే రచియింపఁబడి, బెజవాడలో పోలిశెట్టి రామయ్యగారికి శాశ్వత కాపీరైటున కిచ్చిన, ఈ మదనసాయక నాటకమును పోలిశెట్టి రామయ్యగారివల్ల నేను విక్రియమును శాశ్వత కాపీరైటును పొందియున్నాను.

ఈ పుస్తకములమ్ముటకు, బెజవాడలో శ్రీ సీతారామాంజనేయ కంపెనీవారిని యేర్పాటుచేసినాను గనుక కావలసినవారు బెజవాడకే వ్రాసి తెప్పించుకోవలెను.

ఇట్లు,

కె. ఆంజనేయులు,

చేవెంద్ర.

# ఉపోద్ఘాతము.

దేశభాషలందుఁ దెనుఁగు లెస్స, యని మనవారిచే సమంచితముగ నుడువఁబడిన యాంధ్రభాషయందు నాపిన్ననాఁటఁగోలె గుతూహలము మెండు. ఆ కారణమువలన నాకుఁ దీఱుగడయగునప్పుడెల్ల నేదియో యొక గ్రంథముం జదువుచు నన్వయించుకొంటిని. ఇటీవల మా గ్రామమునందుండు కుఱ్ఱవాండ్రచేఁ గొన్ని నాటకములు బ్రదర్శింపబడుచుండ నందలి కొన్ని పాత్రములకు పద్యములెక్కువ జేసి వ్రాయుఁడనియు నా నాటకములంజూపి నన్నుపదేపదే ప్రోత్సాహపఱచుచుండిరి. కాని, నేనందుల కసమర్థుఁడనయ్యును యేదో యొక విధంబున రచించి వారి నానందింపఁజేయుచుంటిని. అంతనుండియు నేనేదియైన నొక నాటకమును వ్రాయఁ దలంపుతో నుండెడివాఁడను గాని నాకుంగల యల్పపాండిత్యముఁ బరిగణించియు, ననాథనాథు నాతన కవిపుంగవుల ప్రాశస్త్యముఁ దలపెట్టియు, ఇఱువది రెండు వత్సరముల ప్రాయముననే నాటక రచన కుద్యమింపఁగలనా యనియు, నాలోచించి తత్ప్రయత్న మాకాశకుసుమమని యుజ్జగించితిని

ఇటులుండ నామిత్రులు కొందఱేతెంచి బొంతలకోడూరు నివాసులగు శ్రీయుత సూరముగుల ఎఱ్ఱన్నగారి కృతితోఁ బ్రకాశితమైన విచిత్రరామాయణము పద్యకావ్యమునందలి ఋతుధ్వజరాజు చరిత్రముఁ జూపి, దానిని రూపకముగా మార్చి మమ్మానందింపఁ జేయుఁడని నన్నెంతయు మందలింపుచుండిరి. ఇత్యాది విషయముల వలన నా గ్రంథమునందలి కథ నా మూలాగ్రముగాఁ జదివి యింక గొన్ని గ్రంథములలో నట్టికథ యుండుటఁ గాంచి, పద్యకావ్యము

లందలి కథను దృశ్యకావ్యముగా మార్చి యొనరించుట యందలి ప్రయాసమునయిన యోజింపక నాచిఱుత ప్రాయము నైన లెక్కసేయక, పాండితీపటిమ నించుకయుఁ దలపోయక నా యల్పబుద్ధికిఁ దోఁచినటుల వ్రాయ నుద్యమించి ౧౯౨౨ సం॥ జనవరి నెలలో ప్రారంభించి కొలఁది వారములలో నెట్టటో ముగింపఁ జేసితిని.

శిరాం గారి వాస్తవ్యులగు మ॥ రా॥ రా। దుబాకుచిట్టి అప్పయ్యగారు రవుడప్పుడు మాగ్రామమునకు వచ్చి మ ద్విరచిత పద్య జాలముం జూచి, యిది సిద్ధమని చెప్పుచు నన్నానందింపఁజేసిరి. ఇటు లొనర్చినందులకు మిగులఁ గృతజ్ఞతచే నాతని కనేక వందనము లర్పించుచున్నాఁడను.

ప్రాచీనగ్రంథము లందలి కథకంటె నిందుఁ గొంత కల్పించి, కొంత మార్పు గావించి నేర్చినట్లు కథ చెడకుండ, బ్రదర్శించుట కనుకూలమగునటుల వ్రాసినాఁడను. నాటకములు వ్రాయుట నాయట్టి కించిజ్ఞునకు దుస్సాధ్యమైనను పిన్నటఁ గోలెమాసమాజమునందు చిన్నచిన్న వేషములు వేయుచుఁ గొన్ని నాటకముల శ్రద్ధాశక్తిమైఁ జదువుచుండుటవలన నీ నాటకము వ్రాయఁగడఁగినాఁడను. గాని, కవితా ప్రాగల్భ్యమునకుగాదు, గొప్పతనమునకును గాదు, నామిత్రుల నానందింపఁజేయుటకే యని నా యెన్నిక.

"ప్రమాదో ధీమతామపి" అని యుండుటచే మహామహులకే యేదియో నొక కొంతంత గలిగియుండుట స్వాభావికముకదా! అట్టిచో నేననఁగా నెంత? నా పాండిత్యమన నెంత?

ఇదియునుఁగాక, నాకు నాటక రచన కిదియే ప్రథమ ప్రయత్నం బగుటం బట్టియు నిది మహానాటకంబగుటంబట్టియు నేనంతగా దెలియనివాఁడనగుటచేతను యిం దనేక క్లిష్టార్థంబు లుండినను గుణ

గ్రహణ పారీణులగు నస్మద్దేశీయ పండితప్రకాండులు నాయందు దయ యుంచి తద్దోషంబుల గనుపరచినచో ముందు కూర్పునందు సవరించుకొందునని ప్రార్థించుచున్నాను.

ప్రస్తుత కాలమర్యాద ననుసరించి కొన్నిపాటలిందుఁ బొందుపఱచియున్నాఁడను. పాఠకు లట్లే పాడుకొనవలయునను నియమము లేక రాగతాళములు మార్చి పాడుకొనవచ్చును.

ఈనాటకము బెజవాడపుర నివాసులగు మ॥రా॥రా॥ సోలిశెట్టి రామయ్యగారు కాపీరైటు హక్కుపొందియుండుటచే వారి యనుమతి వడయక నితరులచే నీ నాటక మెంతమాత్రమును ముద్రాపితము గానేరదు.

విశాఖపట్నమండలమందలి
గొందూరు,
23—3—1922.

సుజనవిధేయుఁడు
అల్లంశెట్టి అప్పయ్య,
గ్రంథకర్త.

# కథాసంగ్రహము.

—:o:—

## ప్రథమాంకము.

అయోధ్యాపురమున శత్రుజిత్తుఁడను రాజు తన గురువగు వసిష్ఠునితోడను, మంత్రియగు వినీతునితోడను బ్రవేశించి వృద్ధుడగుటచేఁ దన రాజ్యము గుమారుఁడగు ఋతుధ్వజున కొసంగి దానరణ్యమున కేగుదునని చెప్ప ఋతుధ్వజున కింతత్వరలో రాజ్యమిచ్చుట కర్జముగాదని గుర్వమాత్యులు దెలుపుచుండ నింతలో, గాలఁవాదిమునులు రాక్షసబాధల కోర్వఁజాలక రాజు చెంతకువచ్చి ఋతుధ్వజునంపి యా రాక్షసుల సంహారింప జేయుఁడని ప్రార్థింప నతఁడియ్యకొనకుండుటఁ గాంచి వసిష్ఠ వినీతులు కొంతవఱకు బోధింప నంగీకరించి కుమారుని రావించి మునులతో నడవికిఁ బంపుట.

## ద్వితీయాంకము.

ఋతుధ్వజుఁ డరణ్యమునఁ బ్రవేశించి దుష్టులగు రాక్షసుల గొందఱిని దునుమాడ, రాక్షసరాజగు తాళకేతుఁ డేతెంచి ఋతుధ్వజునితోఁ గొంతవడి దురమొనరించి పరాజితుఁడై పాఱిపోవుటయు, నంత ఋతుధ్వజుఁడు వెంబడించి వానిఁ గనుఁగొనఁ జాలక విస్మయమొందుచు తనముందర తాళకేతునిచే నిర్మింపఁబడి మదనసాయక నివసించెడి సౌధమొండుఁ గాంచి లతాంగియను నాపెవలన నెల్ల యుదంతముఁ దెలిసికొని మదనసాయకయందు వ్యామోహితుఁడై యామెను బెండ్లియాడనెంచి తాళకేతునిజాడఁ బాడగాంచి వాని నంతమొందించుటయు, పిమ్మట మదనసాయకకు ఋతుధ్వజునిపై వాంఛగలిగి పరస్పర సంభాషణములవలన నామె, తండ్రియను మతి వడసి పెండ్లియాడుమని మదనసాయక చెప్పుట.

## తృతీయాంకము.

విశ్వావసుఁడు తన కూఁతురగు మదనసాయక తాళకేతునిచేఁ జిక్కెనని దురటిల్లుచుండ ఋతుధ్వజుఁడు వచ్చి మదనసాయక నప్పగించ విశ్వావసుఁ డానందించి యామె నతని కిచ్చి వివాహ మొనరించుటయు, పదపడి, ఋతుధ్వజుఁడు మదనసాయకం గూడి గాలవాది మునులుండు తావునకుం బోవు మార్గమున నాగలోకాధిపతి యగు నశ్వస్థుని కుమారులు శోక, విశోకు లరుదెంచి ఋతుధ్వజునితో స్నేహ మొనరించుకొని పోవుటయు, పిమ్మట ఋతుధ్వజుఁడు మున్యాశ్రమమున కేగి తాళకేతుని వధించివచ్చిన వృత్తాంత మంతయు విశదీకరింప మునులానందించి హతశేషులగు రాక్షసుల నుగ్గాడ నప్పుడప్పుడు రమ్మని ఋతుధ్వజున కాజ్ఞాపించి వెడలుట.

## చతుర్థాంకము.

ఋతుధ్వజుఁ డయోధ్యాపురముఁ బ్రవేశించి, కొంతకాల మేగినపిమ్మట మఱియొకతూరి గాలవాదులఁ జూచి సేగుటయు, మదనసాయక నర్మసఖీజనంబులఁగూడి యిష్టాగోష్ఠి నుద్యానంబునఁ బుష్పాపచయంబొనరించుచుఁ బతివియోగమునఖిన్నయై యంతఃపురమునకు వెడలుటయు, తాళకేతుని తమ్ముఁడగు తూర్యకేతుఁ డదియంతయు మాటుననుండి జూచి ఋతుధ్వజుఁ డడవి కేగు మార్గమున మునివేషధారియై తాను సేకరించిన ముత్యాలహారము మదనసాయకకుం జూపి నీపతి రాక్షసులచే నిహతుండయ్యెనని దంభవాక్యములు సెప్ప నామె నిజమే యనుకొని మరణించుటయు, తదుపరి తూర్యకేతుఁడు దా నొనరించిన కపటోపాయ మాతని భార్యయగు ఘటోదరి కెఱిఁగించుటయు, నంత ఋతుధ్వజుఁ డడవినుండి వచ్చి సతి మృతికి దిగులొంది దానునుఁ బ్రాణత్యాగము గావించుకొనుటకు ఖడ్గముఁ దీయ

వంతలో శోకవిశోకు లేతెంచి, వారించుటయు, నారదుఁడు ప్రవేశించి యామె మరణించుటకుఁ దగిన వృత్తాంత మెఱుకపరచి పరమేశ్వరు ననుగ్రహంబువడసిన మరల నాపె వచ్చునని చెప్పి యేగుటయు, విని, శోక, విశోకలా కార్యముఁ దమ తండ్రినలన నెఱవేరుననియు ఋతుధ్వజు నోదార్చి గమ్యస్థానమునకు వెడలుట.

## ప ం చ మా ం క ము.

అశ్వస్థుఁడు కుమారుల విచారముఁ దెలిసికొననెంచి వలయు వస్తువుల వాంఛింపుఁడని యడుగుటయు నీ యుదంతమంతయుఁ గుమారులు చెప్ప నతఁ డంగీకరించి, పరమేశ్వరు నారాధించుటయుఁ ఈశ్వరుఁడు ప్రత్యక్షమై మదనసాయక నీచ్చుటయు, ఆమె మైమఱచినదై నాథునికొఱకు విలపించుచుండ శోక, విశోకు లూఱడించి నిజోదంత మెఱింగించి ఋతుధ్వజుని చెంతకుఁ గొనిపోవుటయుఁ మిత్రు లరుదెంచెడి వేళ యతిక్రమించినదని ఋతుధ్వజుఁడు చింతింపుచుండ మదనసాయకతో శోక విశోకులు ప్రవేశించుటయుఁ ఋతుధ్వజుఁ డపరిమితానందము నొంది యిదియంతయుఁ దనతండ్రి కెఱిఁగించుటయు, పిమ్మట శతృజిత్తు సంతోషపూర్వకముగాఁ గుమారునకుఁ బట్టాభిషేక మహోత్సవము జరుపుటయు.

సమాప్తము.



# అంకితము.



చ. అరయభవత్కృపాకలన • సంకిలిలేక రచించినట్టి యీ
చరితమునామమా మదన • సాయకనాటకమిష్టు నీకు నేఁ
గరమనురక్తి సంకేతము • గాఁగ నొనర్చితి దీనిఁగొంచుఁ శ్రీ
కరముగనన్ను గావుము, వి • కర్తనవంశజ! రాఘవేశ్వరా!

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

—: పు రు షు లు :—

శతృజిత్తు—కథానాయకుని తండ్రి 1, 4, 5.
ఋతుధ్వజుఁడు—కథానాయకుఁడు 1, 2, 3, 4, 5.
విశ్వావసుఁడు—కథానాయిక తండ్రి 3.
అశ్వస్థుఁడు—నాగలోకాధిపతి 5.
వసిష్ఠుడు—సూర్యవంశజుల గురువు 1, 4, 5.
వినీతుఁడు—శతృజిత్తుని మంత్రి 1, 4, 5.
నయకోవిదుఁడు—విశ్వావసుని మంత్రి 3.
శోకవిశోకులు—అశ్వస్థుని కుమారులు 3, 4, 5.
తాళకేతుఁడు—మునుల బాధించెడు రక్కసుఁడు 2.
తూర్యకేతుఁడు—తాళకేతుని తమ్ముఁడు 4.
దీర్ఘదంతుఁడు } రాక్షసాను చరులు 2.
వజ్రహస్తుఁడు }
నారదుఁడు—4.
గాలవుఁడు—1, 3.
ఈశ్వరుఁడు—5.
సూత్రధారుఁడు—1.

—: స్త్రీ లు :

మదనసాయక—కథానాయిక 2, 3, 4, 5.
లతాంగి—మదనసాయకను ప్రేమించిన చెలికత్తె 2.
కమల— } మదనసాయక చెలికత్తెలు 4.
విమల— }
ఘటోదరి—తూర్యకేతుని పెండ్లాము 4.
నటి—సూత్రధారునిభార్య 1.

ఖేలనాసమయమున, ఇద్దఱు ముగ్గురు మునులును ద్వార పాలకుఁడు, సేవకుఁడు, మొదలగువారు సందర్భానుసారముగా నుండ వలయును.



శ్రీ రామచంద్రాయనమః

శ్రీ

# మదనసాయక నాటకము.



## నాంది

శ్రీ వాణీశముఖాఖిలామరవర • శ్రేణీకిరీటస్థలో

ద్భాసిభాస్వత్పాదకంజుఁ డురుసం • భావ్యుండరాతివ్రజ

ప్రావిణ్యాపహరుండు వాంఛిత జనో • ద్వృంధతపామిత్రుఁడున్

భానాతీతుఁడసంతుఁడాఖ్యుఁడుల స • త్పద్మాక్షుఁడేలున్ మిమున్.

సీ. అఘములకునెల్ల నణువగు • పట్టుదోఁచి

కడఁకతుహీన ధరాధరా • గ్రమున వెలసి

లీలఁదోఁచుత జగముల • నేలునట్టి

విశ్వమూర్తియె మిముఁబ్రోచు • శాశ్వతముగ.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి]

సూత్ర—(తనలో) అహో! నే నెంతధన్యుఁడను?

ఉ. నేఁడుగదా మహోత్సవము • నేఁడుగదా పరిషజ్జనంబులన్

వేడుకమీఱఁగాంచుటఁ బ • విత్రచరిత్రము లాడఁగల్గుటల్

నేఁడుకదా! మదీప్సితము • నేఁడుకదా కొనసాగె, నైన నీ

ప్రోడలనెట్లు సంతసముఁ • బొందఁగఁజేతు నెఱుంగనైతిగా;

సారవచనరచనా విశారదులును, అనుపమాన శేముషీమ
హిమాభిరాములును, సరసకవితా సామ్రాజ్య ధౌరేయులు
నగు నీ సదస్యుల యుల్లంబులు రంజిల్లజేయుటెట్లు? (ఆలో
చించి) ఆ! తెలిసినది నయ వినయ గుణగణ పేటియగు, నటి
నిటురావించి యోచింతుఁగాక. (తెరవంకఁగాంచి) ప్రాణసఖీ!
నటీ!

తరల. అతివ! జాలమ దేల జేసెదు • హాళిఁగొల్పెడి నీదయా
మతుల రాక యెఱింగియుండియు • మానసంబుఁదలంచె దూ
ర్జితమహాశయులాత్మ హర్షముఁ • జెంద నూతన నాటకం
బతులితంబుగ నాడనెంచితి • నంబుజాక్షిరో! రమ్మిఁక్ దా.

[అప్పుడు నటి ప్రవేశించి]

**నటి**—ఆర్యపుత్రా! నమస్కారము. (నమస్కరించును)

**సూత్ర**—కల్యాణీ! అశేష కళావిశారదులగు నీ సభాస్తారులు మన
యందనురాగమున విచ్చేసినందులకు నేఁడెంతయు సుదినమే
కాని, యిమ్మహామహులకుం గృతజ్ఞత నెఱపనెద్దియేని యొక
నవీన నాటకముం బ్రదర్శించి యానంద పారవశ్యులుగ జేయ
నుద్యమించి యున్నాఁడను.

**నటి**—అటులొనర్చుట ప్రశంసార్హమే; అయిన నన్నేలరావించితిరి?

**సూత్ర**—ఏదైన నొక నూతన నాటకముండిన స్మరణకుఁ దెచ్చెద
వేమోయని.

**నటి**—సరిపోయె. నిరంకుశ నాటకాలంకార సాహితీజ్ఞాన హృదంత
రాళులగుత్వాదృశమనీషానంతులె యిట్లు యోచింపుచుండ,
నల్ప పాండిత్యోరాలనగు నాకో నేనాటకమాడుదమని ప్రసం
గించుట యెంతయు జుగుప్సాస్పదముగ నున్నది. అయిన
నేమి? ఆర్యా! మీరిప్పుడే నాటకమాడ నిచ్ఛగించిరి?

సూత్ర—నేనిప్పుడు మదనసాయక నాటకమాడ నెంచితిని.

నటి—ఏమీ! మదనసాయకనాటకమా? ఆర్యా! ఈ నాటకమెవ్వరి
చే రచియింపఁబడెను?

సూత్ర—చెప్పెద నాకర్ణింపుము.

మ. లలిగాంగేయ పవిత్రగోత్ర కలితా • గ్లాంశెట్టి వంశాబ్ధి శీ
తలనాథుండగు సూరనాఖ్యునకుఁ గాం • తా లోకరత్నంబనా
నిలఁ జెన్నొందిన సూరమాంబకు, సుతుం • డీతండు లేప్రాయమం
దుండిక్ దీనినోసర్చె నప్పయసమా • ఖ్యంబొల్పు చవ్వారిగాఁ

నటి—సరిసరి, ఇందులకేనా యింతగా పేర్కొంటిరి?

చ. ప్రకటితసంప్రదాయ, కవి • పద్యులు పెక్కురచించినట్టి నా
టకములు లేవె? వాని నిచ • టప్రమిమీర రసోచితంబుగాఁ
బ్రకటనఁజేసి యీ విప్రుల • పండితసన్మము మెప్పుఁ గాంచమే
యొకచిఱుప్రాయపుంగియిత • డిత్తునకతంగాని యేాదునేబుధుల్.

సూత్ర—బాగు, బాగు. ప్రేయసీ? ఇంతమాత్రమునకే యోచింపు
చుంటివా? అటుకాదు నే జెప్పినది వినుము.

గీ. నందనులు నేర్చు నేరి • నయముటంచు
మాటలాడిన జనకులు • మదిని మెచ్చఁ
బాండితీశక్తి చాలక • బాల్యమందె
వ్రాసినచరిత్ర మెంతయు • వాసికెక్కె.

నటి—ఆర్యాత్మజా! బహురమ్యముగా నుపోద్ఘాతించిరి. మన యం
తఃకరణానుకూలముగ నీ సరసాగ్రేసరు లపారకౌతూహల
సాగరాంతర్నిమగ్నమానసులు కాకమానరు.

సూత్ర—మనకుఁ గావలసిన దదియేకదా!

నటి—రసికశిఖామణీ! భవదీయసముంచిత సాహితీపటిమ నెంతయు

నుగ్గడించిన, మన సంవిధానములు కుదుర్చుకొనుటెప్పుడు
మనమిప్పుడు కార్యాంతర ప్రసక్తులమై యుండుట మఱచితి
వేమో! తడవయ్యె. నింక నాటక ముపక్రమింపమేని ప్రేక్ష
కు లసంతృప్తిఁ నొందుదురు.

సూత్ర—అది నిజమే కాని, నీ గాన కళాకౌశలమ్మున నొక ఋతువుం
గూర్చి వర్ణించి, సభ్యుల నానందింప జేయుము.

నటి—ఏ ఋతువుఁ గూర్చి వర్ణింపుమనియెదరు?

సూత్ర—అదియు నడుగ నేల? ఎఱుఁగవా సంతసమగు వసంతము.

నటి—చిత్తము.

( 2 వ కీర్తన )

శా. హాళిం జెందె శుకంబులంచిత ఫలా • హారంబులన్, మించి మ
త్తాళీపాళిఝుమంఝుమారవమునన్ • హర్షించెఁ బూఁదేనియల్
కేళీ లోలతఁ గ్రాము కీతతి దమిం • గ్రీడించె నుద్యద్గతిన్
బాళిం బాలరసాలముల్ గుడుచుచున్ • బాడెన్ బికంబుల్ రహిన్.

సూత్ర—కామినీమణీ!

గీ. విమలమై, యనివార్యమై • విపుల ఫణితిఁ
బాటఁ బాడితివ దెచాలు • పడఁతి మిన్న!
మనమిదే పోయి నాటక • మునకు వలయుఁ
బాత్రలెల్లను వేసిద్ధ • పఱుపవలయు.
కాఁబట్టి వేగముగా రమ్ము.

నటి—చిత్తము. (అని నిష్క్రమించును)

[ ఇది ప్రస్తావన ]





శ్రీ

# మదన సాయక

## నాటకము.

### ప్రథమాంకము.

[ ప్రవేశము ]

[ శత్రుజిత్తు, వసిష్ఠుఁడు, వినీతుఁడు. ]

శత్రు—సచివాగ్రేసరా!

మ. ఇనవంశంబునఁబుట్టి రాజ్యరమ నే • నిన్నాళ్లుఁ బాలించితిన్
జనముల్ మెచ్చఁగఁ నస్మదీయసుతు నీ • జ్యాభర్తగాఁ జేయ నా
మనమం దెంచి యరణ్యసీమలకు నే • నుంబోవఁ జొనెంచినాఁ
డ నుమానాయకుపాదపద్మములు నే • డన్నేఁడమాత్యోత్తమా!

వినీ—శత్రుజిత్తు మహారాజా!

చ. ఎలమిని సర్వరాజ్యరమ • నేలిరి తొల్లిఁటిరాజులట్లు, మీ
కులముప్రశస్తికెక్క, నన • ఘుండగు మీసుతుఁడా ఋతుధ్వజుం
డిలభరమున్ వహింపఁగలఁ • డే యనఁ దారయ బాలుఁడౌట, మీ
రలె మఱికొన్నినాళ్లు మది • రంజిల నేలవలెన్ స్వరాజ్యమున్.

భవదీయాత్మజుండు బాలుఁడౌటచే, మఱికొంతకాలము తా మీ రాజ్యపరిపాలన మొనరించి, మమ్మానందింపఁ జేయుదురుగాక.

శత్రు—మంత్రివరా! ఏమట్లంటివి? నా కుమారుఁడు బాలుఁడైన నేమి? కుశాగ్రబుద్ధికలవాఁడు కాఁడా!

దిడుట మనకు యుక్తముకాదు. కాఁబట్టి కొంతకాల మాగుఁడు.

శత్రు—(ఆలోచించి) గురువర్యా! మరందబిందు తుల్యములగు భవదీయ వచస్సందోహంబువలన నా కెంతయుఁ జక్కఁగా నుపదేశించితిరి.

సీ. పరిజనకుశలంబు • బరికించి రాజ్యతం
త్రంబులు జరిపించు • రాజు, రాజు,
సర్వేశ్వరునిభక్తి • సతతంబుగాడువక
నెమ్మిరాజ్యంబేలు • నృపతి, నృపతి,
సకలభృత్యామాత్య • సత్పండితగణంబు
నృపతోడఁ బ్రోచెడి • ఱేఁడు, ఱేఁడు,
శౌర్యంబు, దాన, పరి • పాడంబు; శీల, ధై
ర్యము, తేజముంగల • ప్రభువు, ప్రభువు

గీ. అఖిల పరిపంథికానన • న్యత్కుఁ డాదుఁ
డనఁగఁజెన్నొందనలెగాన • ననవిపతికి
దినదినంబును గండమై • తివురుఁగాని
నేమిమెన్న ఁసుఁగలుగదు • చింత నేయ.

మఱియు,

కం. భువి “రాజ్యాంతేనరకం
ధ్రువ” మనిశాస్త్రములయందుఁ • దెలిపిరి తథ్యం
బవనీపతికంటె నృపతి
నవహితుఁడై యింటనుండు • టది తప్పగునే?

ఇవియన్నియు నాలోచించి మీరుచెప్పినచొప్పున ననువర్తింతువాఁడ.

[ తెరలోఁ గలకలము ]

[అప్పుడు ద్వారపాలకుఁడు ప్రవేశించి]

ద్వార—మహాప్రభూ ! నమస్కారము.

శత్రు—కారణమేమి ?

ద్వార—మహాప్రభూ ! ఎవరో కొందఱు మౌనీంద్రులువచ్చి బహి ద్వారంబుచెంతనిలువఁబడి దేవరవారియాజ్ఞకై వేఁచియున్నారు.

శత్రు—మహాత్ములు నిష్కారణముగాఁ జనుదెంచియుండరు. వారి రాక కెద్దియో నొక కారణముండును. సేవకా ! వారిని శీఘ్రమే లోనికిఁ బ్రవేశపెట్టుము.

ద్వార—చిత్తము. (నిష్క్రమించును)

[అప్పుడు గాలవుఁడు మొదలగు మునులు ప్రవేశింతురు]

శత్రు—(చూచి) ఓ వాచంయమికులశ్రేష్ఠులారా !

చ. అనఘుఁడనైతి, పూర్వభవ • మందు నొనర్చిన పాపకర్మముల్
బనివడిఁబాసి మద్గృహము • పావనమయ్యెఁ ద్వదీయ పాదసే
వన మొనరింప సంతతము • వాంఛ దొడంగెను, నాదుభాగ్యమే
మనిగొనియాడవచ్చు నహహా • హా!మునిసత్తములార!మ్రొక్కెదన్.
(అని నమస్కరించును)

మునులు—ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిరస్తు.

శత్రు—మునిచంద్రులారా ! ఈ యున్న తాసనము నలంకరింపుఁడు.

మునులు—మంచిది. (అని కూర్చుందురు)

శత్రు— గీ. కారణంబిసుమంతయుఁ • గలుగకుండ
ధీరులు, మహాత్ము, లెచటకుఁ • బోరుగాన
మీరు రాకకు నర్థంబ • దేదియున్నఁ
జెప్పుఁడీ శిరమునందాల్చి • సేయువాఁడ.

గాల— అర్కకులదీపా, శత్రుజిత్తుభూప ! మారాక కించుక కారణ మున్నది.

మ. ఇనవంశోత్తమ నీ సపర్యలకు మే • మెంతే మనంబందు పే
మను నుప్పొంగుచు సంతసించితిమి దు • ర్మార్గుల్ మహాభీకరుల్
ఘనబాహాబలు, లార్యవైరులగు ర • క్షస్సంఘమే తెంచి, మా
యనువుంజూచిహసించిమోదిరియఘం • బంచింతయోచింపకన్.

మునులు—అయ్యా! ఇంక చెప్పుటకు మా నోరాడకున్నది.

సీ. మఖవాటములనొక్క • మాఱెయూడఁ బెఱికి
పర్ణశాలలకగ్నిఁ • బఱపినారు,
పాఱిపోయినవెంటఁ • బడిచావమోదిరి
మోదిచెవులగాలి • నూఁదినారు
పండినవెండుకల్ • పైకూడఁదీసిరి
సిగలున్న మానులఁ • జెండినారు
పోరఁజాలమటంచు • పోయిమ్రొక్కినవారి
కన్నుల నిసుకచేఁ • గప్పినారు

గీ. చెప్పఁజాలనికార్యముల్ • జేసినారు
కంపుగలయుమ్మి మానోట • నింపినారు
యేమిచెప్పుదమయ్యా మా • యిడుమలిట్లు
రాక్షసులచేతఁ బడుమని • వ్రాసెధాత.

(3 వ కీర్తన)

శత్రు—అయ్యో! ఆనక్తంచరాధము లెట్టి దురధ్యవసాయమొనరిం
పఁజాలుకొనిరి?

ఆ. వె. కాలవిఁబట్టినెత్తి • గోకికొనినయట్లు
కన్నుమిన్నుఁ గనక • కలుషులగుచు
తాపసాధికులగు • తావకీనులతోఁడ
వైరమెంచువారు • బ్రతుకఁగలరె?

గాల—నిజమునిజము. రాజేంద్రా! ఆకర్బురాధములు నిర్భయంబున మా కుటీరంబులసొచ్చి "వినాశకాలే విపరీతబుద్ధిః" యను నట్లు కుడిచికూర్చుండఁజాలక మమ్మనేక నిర్బంధములొనరిం పుచుండ వారిని శపించినం దపోభంగమగునని, యాకాశ పథంబున దృష్టి నిగుడ్చి కొంతవడి యోచింపుచుండ నాయం బరవీథినుండి సువర్ణమయశరీరంబుతో ధగద్ధగాయ మానము గా మెఱయుచుండెడి కువలయాశ్వంబొండరుదెంచె, మేము దానింగని విస్మయంబందుచుండ నాకాశవాణి మునీంద్రులా రా! మీ విప్లవంబడంగె ; ఈ కువలయాశ్వము దేవనిర్మితం బు. దీనినధిష్ఠించినవాఁ డనన్యసామాన్య విక్రమధురంధరుండై యుండవలయును. భూలోకంబునఁ బ్రఖ్యాతికెక్కిన మిత్రకుల సంజాతుండగు శత్రుజిత్తుధరావరుని తనూజుండు ఋతుధ్వజ నామధేయుండీ యశ్వంబధిష్ఠించి, దుష్టరాక్షస గణంబు నిర్ధూమధామం బొనరించి, మిమ్మానందింపఁ జేయగలఁడు. తత్క్షణమాతని దరికేగుఁడని, గంభీర వాగ్గుంభనలవాక్రువ్వ నిట్లరుదెంచితిమి. కావున ;

మహాస్రగ్ధర.

పటుబాహాశక్తియుక్తిన్ । బగతురకులమున్ । భస్మముంజేసి వేట్కన్
జటిలోకంబెల్లమెచ్చన్ । సరభసమున నీ । సత్కుమారున్ రయంబే
చటులోదారావిచారిం। చకపనుపుముమా। శత్రులంద్రుంచివేయున్
కుటిలాత్ముల్ యాతుధానుల్। కుతలముననుబల్। క్షుద్రులింకేలఁజెప్పన్.

శత్రు—మునికులావతంసమా! భవదప్రతిహతాజ్ఞా పాశబద్ధుఁడ నైతిని. గాని (అని యూరకుండును)

అందఱు—(రాజువైపు చూచుచుందురు)

గాల—రాజేంద్రా! ఆలోచించెద రేల ?

శత్రు—(తనలో) అక్కటా! యిత్తుబసిగాయఁడు మాయా వినోదు
లగు రక్కసులనుగ్గాఁడ నా కుమారుని నడు కానకుఁ బంపు
మని పరిపరి పరిదేవనము జేయుచున్నాఁడే; యిప్పుడు నేనేమి
సేయువాఁడ? గత్యంతరమేమున్నది? దుష్టదానవ పరివేష్టి
తంబై, లోకభయానకంబైన ఘోర గహనంబునకు నొంట
రిగా నా కుమారునెట్లు బంపువాఁడ? పంపక యుండెనేని,
వీరలు నాపై గినిసి శపింతురో కదా! నా కుమారు నను గ్ర
హింపుఁడని యెంతేమో సమ్రీభావమున బ్రతిమాలెదను.
(ప్రకాశముగా) మునిసత్తములారా! మదాత్మజునకు

ఆ. వె. అస్త్రశస్త్రవిద్య • లందు మిక్కిలి నేర్పు
గలుగు నొక్కొ లేక • గలుగ దొక్కొ!
నేనె నేగబోయి • నీచరాత్రించర
వర్గమెల్లఁ జంపి • వత్తునిపుడు.

గాల—(వసిష్ఠునితో) అయ్యా! ఈ నృపాలుఁ డన్యథా తలంచుచున్న
ట్లున్నది. మీరు కొంచెము చెప్పియొప్పింపుఁడు.

వసి—అట్లే చేయుదును. (శత్రుజిత్తుం జూచి) రాజేంద్రా! విచారింపనేల?

మ. ఘనదోస్సారముచే సమస్తరిపుల • ఖండించి యేతెంచు నీ
తనయుండు జ్వలతేజవంతుఁడు సుమీ • దానవుల నీవింక చిం
తన సేయం జనదీ మునీశ్వరుల • తంబంపి నీ సద్యశం
బును రక్షింపుము లోకముల్ గనుచు మీ • ముఖ్యంబుగా భూవరా!

కావున, వీరల వెంట మన ఋతుధ్వజునిఁ బనుపుము.
ఆతనికి సమరజయంబు కల్గి శుభంబు కలుగును. దుర్బలస్య
బలంరాజా, యనునట్టి సూక్తిగాదు భూభుజులకు వశ్యకరణీ
యముకదా!

వినీ—పృథ్వీపాల చూడామణీ! మన ఋతుధ్వజుఁడు దేవనిర్మితంబగు

నాజానేయం బధిష్ఠించిన, నెంతటివారైన నతనిజయింప నశక్తులని గగనవాణి వాకు్రిచ్చుట మృషయగునే? మీకీసంకోచమేలకలిగెను? సంకోచ మొదవినచో గగనవాణి మరల నిచ్చుట వాకు్రివ్వఁగోరుదుము.

మునులు—సంశయింపఁజనదు. నిరాటంకముగా గగనదేవతచే నిచ్చుటఁ బలికించఁగలము.

(తెరలో)

ఓ శత్రుజిత్తురాజా! ఈ మునులవాక్యముల నుల్లంఘనీయములు నీ మనంబున నణువంతయు భీతిలేక నీ కుమారుని వీరలవెంటఁ బంపుము. ఆతఁడు దేవనిర్మితంబగు కువలయాశ్వం బారోహణమొనరించి, ఆ తతాయికులంబులఁ బరేతరాట్పురంబున కనుపఁగలఁడు. ఈ వాక్యంబులు ముమ్మాటికి, తథ్యము. తథ్యము. తథ్యము.

శత్రు—(సంతోషముతో) మంచిది. సేవకా! యిటురమ్ము.

సేవ—(ప్రవేశించి) దేవా! చిత్తము. ఆజ్ఞయేమి?

శత్రు—నీవు కడురయంబున నేగి మదాత్మజుండగు ఋతుధ్వజునిటకు రావింపుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

శత్రు—(తనలో)

గీ. ఆర్తరక్షణకై మదీ • యాన్వయంబు
ధరణివెలయుట నిక్కమై • దనరెనేని
సకలవైరులఁదునుమాడి • సమరజయము
నా కుమారునకొసఁగుత • నళిననాభ!

[అప్పుడు ఋతుధ్వజుఁడు ప్రవేశించి

ఋతు—(తనలో) ఆహా! నేఁడు మా తండ్రిగారు నన్నుఁ బిలిపించు

టకుఁ దగిన కారణమేమైయుండవచ్చునో కదా!

మ. అపరాధం బొకయింతలేదు పటుగ • ర్వాయత్తచిత్తుండనై
యెప్పుడుం దండ్రికి మీఱుచేసెఁగనేఁ • డేలానన్నుఁబొల్పెఁబం
చె, పరుల్ కొండెములాడి తండ్రియెదుటం • బెట్టించిరో లేక స
త్కృపఁజూపంజనకుండెబిల్చెనో కొ సం • దేహంబుగన్లోమదిన్.
ఏదియెట్లున్న నా సనాతనునిదే భారము. (ప్రకాశముగా)
జనకా! నమస్కారము. గురువర్యా! నమస్కారము. (అని
నమస్కరించును)

వసి—వత్సా! దీర్ఘాయుష్మంతుఁడవుకమ్ము.

శత్రు—(కౌఁగిలించుకొని) కుమారా! రమ్ము. నా యంకతలమ్మునఁ
గూర్చుండుము.

ఋతు—(కూరుచుండును)

శత్రు—కుమారా, ఋతుధ్వజా!

ఉ. దుష్టనిశాటవర్గములు • దోర్బలవృత్తిని వచ్చి వీరలం
గష్టములొందఁజేసెనట • గావున నీవు స్వసేనఁగూడి సం
తుష్టినిబోయి మాసన ప • త్రుల్ నుతియింప సమీకమందునా
దుష్టులగీటడంచి రణ • దుందుభివేయుము శత్రుభీకరా.
మఱియు, నిమ్మహాత్ముఁడుగాలవమునిసత్తముఁడు. ఉతనితపోమ
హిమచే సమరలోకంబున్నుండి, దేవనిర్మితంబగు కువల యా
శ్వంబొండరుదెంచె; దానిని నీవధిష్ఠించిన నభియాతివర్గంబన
ర్గళంబున జయింపఁగలవని యాకాశవాణి నుడువుచు, వీరల
నిటకనిపెను. కాఁబట్టి, నీవుకడురయంబునంజని యిమ్మునులుం
డు, దుర్గమకాంతారంబునకేగి, యందు నిరంకుశాధికార్య
మొనరింపుచుండిన దనుజ రాజిం బోకార్చి జయంబందిరమ్ము
(మంత్రిఁజూచి) మంత్రీ! నీవు శీఘ్రమేపోయి సమస్తసైని
కుల నిజాయత్తంబు కండని యాజాపింపుము.

ఋతు—జనకా!

ఉ. లోకములెల్లమెచ్చమది • లో బెగడొందక దుష్టదానవా
నీకమునంగరస్థలిని • నేఁడెజయించి మునీంద్రపాళికి

స్తోకమునందంబుఁగూర్చిన వి • శుద్ధగుణాఢ్య విచారమేల ? మ
ప్రాకటబాహుశక్తియె య • భంగురమేటికి సైన్యసంతతుల్ ?
అదియునుంగాక,

ఉ. స్వార్థమువీడి కానన ని • వాసముఁజేసి రమేశుఁగూర్చి య
భ్యర్థితులైన యిమ్మునికు • లాఘ్యులఁ గాచుటకన్న ధాత్రిలో
నర్థము వేఱెయున్నదె ? ధ • రాధిపసంశయమే « పరోపకా
రార్థమిదంశరీర " మని • వ్యాప్తినిబొందదె లోకమంతటన్ ?

మునులు—(తమలో) ఓహో! ఈతఁడు వేద వేదాంగపారంగతునిగ
నున్నాఁడు. స్మృత్యర్థములఁగూడ వివేచించి చెప్పుచున్నాఁడు.
ఇతఁడు మన క్రతువిధ్వంసకులగు క్రవ్యాదులనెల్ల నొక్కుమ్మ
డిం బీచమడంచఁగలవాఁడు.

శత్రు—కుమారా! మంచిది. నీ విప్పుడే పోయి మా దురితదానవు
ల నిధనం బొనర్చిరమ్ము.

గాల—రాజకుమారా!

ఉ. అంచితలీలనీ కువల • యాశ్వమునెక్కి, నిశాటకోటి మ
ర్దించుము మాయుపద్రవము • దేవుఁడెఱుంగును మీకుమేలు మే
మించుకర్థైనఁ జేయగల • మే ? భయమందినవారమాట రా
వించితిమయ్య ! నీవు పటు • వీరుఁడనంచు నభంబె పేర్కొనన్.

కాఁబట్టి నిశ్చితకార్యమునకు జాగుసేయనేల ? ఆర్తులమగు
మమ్ము భవదీయ కృపారస శీతలేక్షణంబులఁ దనియనిమ్ము.

ఋతు—ఓ నిరాహారులారా !

(4 వ కీర్తన)

శా. చింతాసాగరమీద నేటికి నిజ • క్షేమంబు దీపింప సా
ధింతున్ రాక్షసవర్గమిస్సెచని వే • ధింతున్ మదస్త్రాళి జా
ప్పింతుం జేర్చి కలంచెదన్ మిగులనా • ప్పింతున్నిరోధింతుమీ
యంతేవాసులు సంతసింపజనుల • యాశ్చర్యముం బొందఁగన్.

మునులు—ధన్యోస్మి ధన్యోస్మి.

ఋతు——(తండ్రింజూచి) జనకా! మునుల యాజ్ఞనుల్లంఘించఁజనదు కావున నాకు సెలవిండు. (వసిష్ఠునింజూచి) వసిష్ఠభగవానుఁడా? మదస్త్ర శస్త్ర విద్యానైపుణ్య మరులపైఁ గరంబేర్పడునటుల యాశీర్వాదింపుఁడు.

వసి-శత్రు——కుమారా! పోయిరమ్ము. విజయలక్ష్మి తప్పక నిన్నే వరించును.

ఋతు——చిత్తము. (మునులఁగాంచి) మునికులతిలకులారా! ఇఁక వేగ మెరంగు పోవుదము. (అని లేచును)

ముని——మంచిది. రమ్ము. (రాజుంజూచి) రాజేంద్రా! మా యాప్తి తంబీడేర్చినందులకు, మేము మందానంద కందళితహృదయారవిందులమైతిమి. నీ యశోలతికా గుళుచ్ఛము లాచంద్రతారార్కముగా నంకురించి పరిణమించుగాక. మే మిదే పోవుచున్నారము నీ కుమారున కే విధమగు భయమును గలుగనీయము. (నిష్క్రమింతురు)

శత్రు——మంత్రీ! నేఁటికిఁ గొలువుచాలింతము.

విసీ——చిత్తము. (అందఱు నిష్క్రమించుచున్నారు)

[యవనిక పడును]

గద్యము. ఇది శ్రీ రామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవిత్వ
గాంగేయగోత్ర పవిత్రాల్లంశెట్టి వంశపయః పా
రావార రాకాసుధాకర, సూరనాఖ్యతనూ
భవ, సూరమాంబాగర్భశుక్తిముక్తాఫల,
సకల సుధీవిధేయాప్పయనామధేయ
విరచితంబైన మదనసాయకనాట
కంబునందు ప్రథమాంకము
సంపూర్ణము.

శ్రీ

# మదనసాయకనాటకము.

## ద్వితీయాంకము.

[ ప్రవేశము అప్పుడు గాలవాదిమునులతో ఋతుధ్వజుఁడు ]

**ఋతు**—మునులారా! ఈ యరణ్యప్రదేశమేనా మీ నివాసము?

**ముని**—రాజకుమారా! ఇదియే మా నివాసము. ఈ యరణ్యము ననే రాక్షసులున్నారు. వారిని సంహరింపుము.

(నిష్క్రమింతురు)

**ఋతు**—మంచిది. మీరు వేఁ పొండు.

**గాల**—అయ్యా! మీ రీ సమయమున బహుజాగరూకతతోఁ బ్రవర్తింపవలయునుఁడీ (నిష్క్రమించును)

**ఋతు**—(కోపముతో) ఓ నిశాచరాధములారా! నిరంకుశవ్యాపార లీలావిజృంభణంబున, కన్నులమిన్నుఁ గానకయుండి, యెన్న రాని తపోనిష్ఠా గరిష్ఠులైయున్న యిమ్మునిచంద్రుల తపోభంగమొనరించి, దుర్భరంబగు నిర్బంధములొనరింపుచున్నారా? చూడుఁడు. మిమ్మిప్పుడు కదనంబున సదమదంబొనరించి యమసదనంబున కనిపెదను.

**మ.** అతిబాహోద్ధతిఁజూపి, పాంధజన సం • హారంబుగావించి, స
మ్మతితోవారి భుజించి చాలక దురో • న్మాదంబుచే నిత్యమీ
యతిసంఘంబులఁ బాఱఁదోలినటుల • య్యారేమదిన్ యూహఁ జే
సితిరోఁ గాక బిరానరండు మిము నా • జింగూల్చెదన్ జూడుఁడీ.

[ అప్పుడు దీర్ఘదంతుఁడు ప్రవేశించి ]

దీర్ఘ—(తనలో) హా! నేఁడుహాయిగా విందుదొరకినది. దొరుక కేమి? సమధిక బాహాబల నిస్త్రాణ త్రైలోకులమగు మాకప్రతిహతంబుగాక, ప్రతిహతం బెందుగలదు? (బిగ్గరగా) ఓరోరీ! వజ్రహస్తాది రాక్షసయోధులారా! రండురండు.

పంచచామరము.

మనంబునందుఁ గొంకుపీడి • మర్త్యుఁడొక్కఁడీడకున్
పనేమిలేక వచ్చెవీనిఁ • బట్టి వేవధింతుమో

(తెరలో)

చనంబికేల వేగవానిఁ • జంపిమాంసఖండముల్
దినంగవచ్చుచుంటిమేము • దిక్కులల్లలాడఁగన్.

దీర్ఘ—(ఋతుధ్వజునిం జూచి దరిలేని భయ సంభ్రమములతో) అబ్బో! నిరంకుశాధికారముగా నీ కాంతారమునందహర్నిశముఁ దిరుగులాడుచున్న మమ్మెదిరించి పోర నొక నరాధముండరుదెంచెనుగా! చూతము. వీని బలపరాక్రమములు. (ప్రకాశముగా) ఔరా! మానవాధమా! మా తాత తండ్రులనుండియుఁ గరతలామలకంబుగా నీ కానన సంచారము సుభోజ్య ప్రదంబైయుండ, నీ వెచ్చటనుండి మా యనువులూడదీయవచ్చితివి? ఇఁక నెందుఁబోయెదవు?

గీ. తులువ వంటింటి కుందేలు • వలెనునీవు
మేము విహరించు వనిఁజొచ్చి • మెలఁగితౌర
చూడు నీ ప్రాణమిప్పుడే • యూడఁదీసి
రక్తముంబీల్చి మాంసంబు • రహింభుజింతు.

దురాత్మా! రమ్ము నిన్నిప్పుడే పట్టి వల్లార్చెదను.

మత్తకోకిల.

ఓరి దుర్మతి కాచుకొమ్మిక • నొక్కవెట్టున నిన్ను నీ
వారిగూల్చి భుజింతు ప్రాణముఁ • బట్టి యావలఁ బోర పో

ఋతు—రోరి కాలుఁడుబిల్చెనిన్ను • దురూహలేటికి తాళునిఁ
బోరఁగూల్చి సృగాలకోటికి • భోజనంబిడు దిప్పుడే.

(అని సమీపించి కత్తిఁ ద్రిప్పును)

దీర్ఘ—హా! చచ్చితిని. (అని భూమిపైఁబడును)

[అప్పుడు వజ్రహస్తుఁడు ప్రవేశించి]

వజ్ర—(అటునిటుఁజూచి) దీర్ఘదంతా, దీర్ఘదంత! యెక్కడనున్నావు? మీ తాతతో నభియోగము సేయఁబోతివా? (ఋతుధ్వజునిఁ గాంచి) అబ్బో! కొంపమునిగినది. మహా బాహు బల సంపన్నుఁడగు నీ దీర్ఘదంతుఁడే యీతనితోఁ బోరి తన పితృవ్యులఁజేరఁజనెఁగదా! నేను వీనిం దలపడి పోరిన నా పితృపితృవ్యులఁజేరవలెననుట సందేహముండునా? (నవ్వుచు) వీడునన్నేమిచేయఁగలడు?

ఋతు—(నవ్వుచు) ఏమిచేయఁగలఁడా? ప్రాణములూడదీయఁగలఁడు. (సమీపించి) ఓరీ! నీ యాలోచనము నే నెఱుంగనిది కాదు. వెనుదీయకరమ్ము. నీ పొగరడంగలదు.

వజ్ర—(తనలో) ఓహో! ఈతఁడు రాక్షస కులాపహారణమునకై యావిర్భవించి, మూర్తీభవించిన విలయకాల కాలునికరణి ననుకరింపుచున్నాఁడు. వీనిం దొడరిపోరహరునికైన శక్యంబు కాదు. నేఁ బోరిన నాతని నిశితబాణపరంపరల కోర్వఁగలనా? (యోచించి) ఆఁ! ఇదెంతటికార్యము. వీని నొక త్రుటిమాత్రములోఁ జంపి మా రాజగు తాళకేతున కెఱిఁగించెదగాక.

(ప్రకాశముగా) ఔరా! మనుజాధమా! భయపడి పాఱిపో
కుము. నిన్నిప్పుడే గాలుని మ్రోలఁబడవేయుదును. (బాణము
విడుచును)

ఋతు—ఔరా! నిశాటా! కాఱులు ప్రేలకుము. (బాణములు విడు
చును)

వజ్ర—ఓరీ, ఏమి నీ పొగరు? చూడుము. మా రాజుతోఁ జెప్పి
నిన్నిప్పుడే సంహారంబు గావించెదను. (అని పోవుచున్నాఁడు)

(తెరలో కోలాహలము)

ఓరోరీ, మానవకులపాంసనా! పాఱిపోకుము. నిర్వక్రపరాక్ర
మక్రమ నిర్మదితలోకనారక్షులగు రాక్షసులీ దుర్గమకాం
తారంబున పెచ్చుపెరిఁగి చరియించుచుండ, గుండె తాయిజేసి
కొనివచ్చిన నీ వెవ్వాండవురా? రాక్షసవరాయలెఱుంగ యక్ష
రాజసఖుండగు ఫాలాక్షుండైన నక్షుండు కాఁడని యెఱుంగ
వైతివిగా! నిలునిలు. నీకు కాలము దాపరించినది.

ఋతు—(నవ్వుచు) అబ్బా! ఎంతచిత్రము.

(తెరలో)

మహారాజా! ఆ యుఱుమువంటి కంఠధ్వనికలవాఁడే తాళకే
తుఁడు. వాని బారి భరింప నశక్యంబు. మీ రీ సమయమున
బహు జాగరూకతతోఁ బ్రవర్తింపవలయును.

ఋతు—(కోపముతో) ఓరీ, నిశాచరాధమా!

శా. అక్షీణోత్కట బాహువీర్యమున సం • హారంబుగావింతునో
రక్షోవంశనికృష్ట నిన్ను గరిమన్ • రక్షింపనూహించి ఫా
లాక్షుం డడ్డమువచ్చి నిల్చిన మహే • శైనం ద్రిలోకంబులం
బక్షింపంగలనంటి విప్పుడె నినుం • బక్షించు నా యస్త్రముల్.

[అప్పుడు తాళకేతుఁడు ప్రవేశించు]

(5 వ కీర్తన)

తాళ—(కోపముతో)

ఉ. ఎక్కడనుండివచ్చితివి • యెవ్వఁడవీవు దురాగ్రహంబునం
జిక్కితివిప్పు మంటఁగని • జీవముఁబాసిన కీటకక్రియన్
మక్కువనిట్టి దోషమగమి • మత్తగజంబును దాఁకినట్టులా
ముక్కిడిమానవులంగలసి • ముందఱకుం జనుదెంచినావిసీ.
మఱియు

ఉ. మెక్కితి పాంథసంతతిని • మెక్కితిఁ దక్కినమానివర్గముఁన్
మెక్కితి నా జినన్నెదిరి • మేటిమగంటిమిజూపువారినిన్
మెక్కెదరోరి నిన్నిపుడె • మేదినిలోననుఁగెల్చిపోరఁగా
నొక్కన్నికైన వీలుపడ • దొక్కఁడవీవు ననుంజయింతువే!

బుతు—(కోపముతో)

ఉ. చక్కడఁగించితిన్ మునుల • జంపితిఁబాంధులఁది టివీరులం
చిక్కనిక్కిబల్కెద వ • దేలర దుర్మతి? నీదు రాసము
న్మక్కలుగోసి జంతువుల • నోటికొసంగెదచూ మిప్పు నీ
యుక్కడఁగింపవేసి తొక • యుగ్రపుబాణముభే క్రమె తగన్.

(6వ కీర్తన)

(అని బాణములొండొరులు విడుచున్నారు)

తాళ—(భయమభినయించి) అబ్బా! ఈ ఘోరనారాచంబు నా ప్రాణవాయువులూడఁదీయుచున్నదే! ఈతని నెదిరింప నే వచ్చిన ముహూర్తమునగనే నాకు పరాజయమొనవునని యనేకాంతరాయములు సూచించినవి. సాహసించి యెదమన్నను,

కం. బాహువులాడకయుండెను
బాహాబలమెల్ల నొక్క • పరిహాసనడఁగె

దేహముకంపమునొందెని

రీ హంబంచేంద్రియంబు • వెటవెట నుండెన్.

కాఁబట్టి నేనిప్పుడేపోయి యొక గిరిగహ్వరంబునఁజొచ్చి ప్రాణంబులుదక్కించుకొని మరల వచ్చెదగాక. (అని పోవుచున్నాఁడు)

బుధు—(కోపముతో) ఔరా! బాలిశా! అనికంజూని, వెనుదీసిపారి పోవుచుంటివి. ఇదియేనా నీ పౌరుషము! ఇదియేనా నీ ప్రతాపము. ఎటులయిన నిన్నుజంపక విడుచువాఁడెవఁడు.

(7వ కీర్తన)

(అని వెంట నంటిపోవుచున్నాఁడు)

---

## ద్వితీయరంగము.

:o:

ప్రదేశము:- అంతఃపురము

[ప్రవేశము మదనసాయక, లతాంగియను చెలికత్తెతో]

మద—(విచారముతో) అక్కటా! నేనెంతపాపపు పుటువుఁ బుట్టితిని? ఎడతెగని చెలిమితో నచ్చెలీరత్నంబులఁ గూడి స్వాద్వానవద్యంబుగ నుద్యానంబున విహరించెడి గునబాయపు బిత్తరినయ్యు, నేనంతఃపురంబున బంగారు సూఁగుటుయ్యెల నూఁగుచుండ గైలికంబున నొక్కప్పుడు ఎడువాయువుసోఁకినన్నొకంత బాధించునని శైత్యోపచారంబులు గావింప, నుత్తమ మత్తకాశినీ సంఘంబులఁ బనివిన తల్లిదండ్రుల గాఢానురాగముచేఁ బెంపువడసిన సుకుమారినయ్యు, నర్మసఖీ జనంబులఁ

గూడి విహరింపుచు, ఘష్పాపచయంబుఁ గావించిన, నా వ్రే
ళ్లు కనుగందునని యెంచి, ముచ్చటలం బ్రొద్దుపుచ్చి మచ్చిక
మీఱ నన్నామెడి చెలిమికత్తియలం బెడఁబొందినదాననయ్యె,
తుట్టతుదకీ కట్టిఁడి రక్కసునిచేఁజిక్కి పట్టరాని దుఃఖపారావా
రంబున మునింగి గుండె దిట్టపరచుకొని యుండవలసి వచ్చె
నుగదా! హా! విధీ!

చ. చెలిమిపడంతులం గలసి • వేడ్కఁ బూవులుగోయుచుండఁగా
ఖలుఁడగు రక్కసుండు ననుఁ • గాఱియ వెట్టఁగ ముట్టడించి యీ
బలితపు కానలో విడచి • పాపము టించుకఁ దలంచ డక్కటా!
బలిమిని పెండ్లియాడునఁట • బ్రహ్మ లిఖించిన వ్రాఁతయెట్టిదో.

(8 వ పద్యము)

లతాం—అమ్మా! ఊఱడిల్లుము. నిన్నా రాక్షసుఁడెట్టి నిర్బంధము
లొనరింపకుండ నే నింతవఱకుఁ గాపాడుచు వచ్చితినిగదా!
ఇటుమీఁదట నైనను నీ కెట్టికొఱంతలు వాటిల్లనేరవు. నిన్ను
విడనాడి, నీ తల్లిదండ్రులపరితాప చింతాసాగరమున మునుం
గుదురని వారిం గ్రక్క తెచ్చుకొని నీ వెంతమాత్రము మదన
భోజనాదుల విడనాడకుము. నీ కేమియు భయములేదు.
ఆసేతు శీతలాచల రణావిక్రముఁడని పేరువడసిన నీ తండ్రి
విశ్వావసుఁ డెప్పటికయిన నీ రాక్షసునుగూడి నిన్నుఁ గొని
పోక మానఁడు. ఊఱడిల్లుము.

మద—అమ్మా! ఇంక నూఱడిల్లుటెట్లు? నే నెంతగొప్ప బ్రతుకు
బ్రతుకనెంచితినో యంత దీనస్థితి ననుభవింప వలసివచ్చినది.

ఉ. పుట్టితి రాజపుత్రినయి • పుట్టితి నుత్తమకాంత గర్భమం
దెట్టి మనోహరాంగనకు • నెవ్వఁడు పెండిలియాడుదో కొ- నా

నిట్టుల దుష్టదానవున • కే చెయిజిక్కితి నెట్టివంశమునఁ
బుట్టిన ఘాతవా్రత బుసి • వోవునె యెవ్వరికైన నెప్పుడున్.
నే నీ పాడుశరీరంబుతో నెంతకాలము భూమిపై మనియున్న
నేమిలాభము? ఇంక మరణమే శరణ్యము.

గీ. అనలమధ్యంబునంబడి • యసువులెల్లఁ
బాపికొందునుగావున • పాపమనక
చిచ్చువెలిఁగించునే నందు • సాచ్చియయిన
మానభంగంబునొందక • మనెదనమ్మ! (అనిలేచును)

లతాం—(కూర్చుండఁబెట్టి) అయ్యో! చిచ్చునంబడి ప్రాణములు
విడుచుటయేగాక, బ్రతికియుండుటెవరితరము? అమ్మా! ఎంత
వారికైనఁ బురాకృత దోషఫలం బవశ్యభోక్తవ్యముకదా!
దీనికై స్వతస్సిద్ధముగ ప్రాణము విడనాడనేల? నిన్నిట్లు కలఁ
తనొందించిన క్రూరాత్ముని కెంతును మేలులేదు. భయము
దక్కియుండుము. (అని కూర్చుండబెట్టి యటునిటుఁజూచి)
మదనసాయకా! నిన్నుఁ గొనివచ్చిన తాళకేతుని సంహరిం
చి యథాస్థానంబునకు నిన్నుఁ గొనిపోనెంచి వచ్చిన నీ జన
కునివలె నెవ్వరో యిటకువచ్చుచున్నారు చూడుము.

మద—(చూచి) ఎవరు; ఎవరువచ్చుచున్నారు? నా జనకుఁడా!

లతాం—(పరికించి) కాదుకాదు నీ జనకు నా దేశంబున వచ్చిన
యొక రాజకుమారునివలె నున్నాఁడు. చూడుము. అతఁడిటకే
వచ్చుచున్నట్లున్నది.

[అప్పుడు బుతుధ్వజుఁడు ప్రవేశించి]

బుతు—(తనలో) ఆహా! ఏమిది, యాశ్చర్యము. నేనిప్పుడే తోృసఁ
దప్పక తాళకేతునివెంట నంటి వచ్చియుంటిని కదా! వాని
జాడ యిసుమంతయుఁ గనుపించక యిందొక సౌధంబున గం

ఖర్వాంగనలు నివసించెడి సూచనములు గన్పట్టుచున్నవే! ఆ రాజసౌధముం జెంతరిగియుండునో కదా! ఇది చాల చిత్రముగ నున్నదే. ఇట్టి నవ్యాజతేజోవిరాజితంబగు సౌధ రాజంబిదివఱకు నే నెచ్చటనైన నుపలక్షించి యుండలేదే!

మ. ఇదియిందాగ్రనివసించునంతిపురియో • యిందుండుకాంతామణుల్
త్రిదశుల్ గోరినవారలో భళిర యీ • దివ్యాంగన శ్రేణికిన్
సదనంబై వెలుగొందియుండుటకు నీ • సౌధంబు రూపించె శా
రదకాంతుల్ దిశలం బయల్పడిఁయు న • గ్రశ్రీలశోభిల్లుచున్.

సీ. కమనీయ తపనీయ • కలధౌతమయసము
జ్జ్వలభాసమన్విత • జాలకములు
విమలవిద్రుమఖండ • గములతో బహువిధి
త్రముగనొనర్చిన • స్తంభములును
హరినీలరుచులీని • విపులమౌ మోపమై
వాటమైయొప్పుసి • వాటములును
చంద్రకాంతోపల • స్థగిత నానావ్య
భవ్యవిలాస సో • పానములును

గీ. గలిగి యభినవ సౌభాగ్య • గరిమవించు
నిమ్మనోహర శుద్ధాంత • మెవ్వధూటి
దౌకొ? యెవ్వనిఁగాంక్షించె • నౌకొ యెట్టి
మోహనాంగియొ యిందుండు • ముగుదమిన్న.

(కొంచము పరికించి మదనసాయకంజూచి) భళిరా! ఈ యిందుముఖి సుందరవదనారవింద సందర్శనంబునంజేసి మదీయ జన్మ పవిత్రమైనది. బాపురే! ఏమి యీమె హావభావ విలాసవైఖరులు.

చ. లలితరసాలపల్లవ వి • లాసములంబుజనేత్రి హాస్తముల్
పలుకులు జుంటుతేనియలు • ప్రియముఁజూడఁగ ముద్దుగారు, ని

స్తులతనుదీ ధితుల్ దిశలఁ • దోఁచెనయామెధరిత్రినీమె నిం
పలరసృజించినట్టి చతు • రాననుఁ డెంతటి ధన్యుఁడో కదా!

మఱియు

(రాగమాలిక.)

సీ. పున్నాగ యానయీ • భువనైకసుందరి
లోలంబవేణి యీ • లోలనేత్రి
కల్యాణి యీయింతి • గాంచేయసుమనాస
నవకంబుకంఠి యీ • నాతిమిన్న
చక్రవాకములనఁ • జాలు నీమెకుచంబు
లధరము దొండపం • డనఁగవచ్చు
క్షీరవాణి యనంగ • మేరమీరినచాన
మృగరాజమధ్య యీ • మెఱుఁగుఁబోఁడి
గీ. శంకరాభరణముఁ కదా • చానయూరు
బాలచందురుఁడౌ కదా • భామనుదురు
బాగు బాగుర యీ యింతి • పంచబాణు
నారవశరమ్మనఁగభువి • నలరెభళిర!

ఔరా! ఈమె ముఖచిహ్నము లీక్షించుకొలఁది నామనస్సం
తయు నీమెయందే యావహించియున్నది. ఎంతసేపు వర్ణిం
చినను తనివితీరకున్నది. (కొంచము సమీపించి) ఆహా! ఈ
నారీ శిరోమణి;

(9వ కీర్తన)

చ. సురఘణియక్షసాధ్యకుల • సుందరిరో యటుగాకయున్న నీ
వరతనుభావిశేషములు • వర్తిలునే నరకాంతలందు, హై
సరె! తమిమీర నీవికచ • సారసలోచనఁ గూడనట్టి యా
వెరవరి జవ్వనంబడవి • వెల్గిన వెన్నెలగాదె యక్కటా!

మద——(లతాంగింజూచి) లతాంగీ! ఈతఁడెవ్వరో మనచెంతకే వచ్చి లేనిపోని యుపోద్ఘాతము జరిపించుచున్నాఁడు. మన మీ సమయమున నితనికిఁ బ్రత్యుత్తరమిచ్చుట యసమంజసము. ఆపత్సమయమున నున్నవారు గడ్డిపోచకంటె నలంతు కదా! పోవుదము రమ్ము. (అని పోవుచున్నది)

లతాం——అమ్మా! ఈతఁడెవరో తెలిసికొనకయే మనమేగిన నధిక్షేపించితిమని మనపై నితఁడు కోపించిన గోరుచుట్టుపై రోకలివేసిన చందముగా నుండును. రమ్ము నీకు భయములేదు. (అని వెడలుచున్నది)

ఋతు——(తనలో) అయ్యయ్యో! నే నీ నికుంజంబుమాటున దాఁగి యుండి, కొంతసేపు వీరి సంభాషణమాలించిన బాగుగా నుండునుకదా! ఎంతపొరపాటుపనిచేసితిని? నిష్కారణముగా వీరిని లోనికనిపి యింకయెవ్వరిమోమీక్షించి యానందించఁగలను? నా మక్కువకు వచ్చిన చక్కరబోడి——నా పాలిఁటి పెన్నిధానము——మదీయ హృదయఫలక విహారిణి——హా! తరుణీమణీ! ఎందేగితివి?

గీ. ఏలవేధించెదిట్లు లీ • వేళతాళ
జాలజాలమదేల యీ • లీల బాల
బేలతనమేల మేలనే • జాలఁదూల
నేలనేలుమదాజ్ఞను • కూలశీల.

లతాం——(పరివేశించి తనలో) ఆహా! ఈతని ముఖలక్షణములం బరిశీలింప నొక రాజకుమారునివలె నున్నాఁడు. ఈతఁ డిచటికి రాదగిన కారణమేదియో యుండవచ్చును. మా మదనసాయకంజూచి, యనంగ శరపీడితుఁడై యిట్లు పరితాపమునొందుచున్నాఁడని వీని ముఖకాంతియే చెప్పక చెప్పుచున్నది.

కానిమ్ము, వీనితో సంభాషించి యుదంతముఁ దెలిసికొనియె దగాక. (ప్రకాశముగా) అయ్యా! అంతఃపురకాంతామణులు నివసించు నీ మాయాకల్పిత సౌధరాజంబున కరుదెంచిన మీరెవరు? నిజముగా లోకమానము నెఱింగిన పురుషోత్తము లీ ప్రదేశమునకు నిర్భయముగా నరుదెంచుదురా? అటు కాదేని పొరపడివచ్చిన మీ నామమెయ్యది? నివసించు తావె చ్చట? ఇక్కడ కేలరావలయును?

ఋతు—(తనలో) చదువువేయ నున్నమతి పోయినట్లా మందయాన యందలి భ్రాంతిచే నేనింతవఱకసురుసురనుకొనుచుండ, నీమె యాడు వాక్యములవల్ల బొత్తిగా శరీరమునందు చైతన్యము తప్పినది. అక్కటా! నేనిప్పుడీమె కేమని ప్రత్యుత్తరమిచ్చు వాఁడ? కానిమ్ము. (ప్రకాశముగా) మచ్చకంటీ! ఇచ్చటకు నే వచ్చుటకొక కారణమున్నది. అది నీకు సాంగముగాఁ దె ల్పెద గాని, నీ విదివరకాడిన వాక్యమునం దతిశయోక్తి రూ పించుచున్నది. అదేల యట్లంటివి?

లతాం—(రిచ్చపడి) అతిశయోక్తియా? అతిశయోక్తియా? ఏమాట యందు మీకట్లు రూపించినది?

ఋతు—“ఈ మాయాకల్పిత సౌధంబున” అని పలుకుటయందు;

లతాం—ఓహో? ఇదియే పర్యాలోచనీయమా? (నవ్వుచు) మీకు కొంచము పిచ్చియెత్తినట్లున్నది.

ఋతు—అదేల?

లతాం—(స్వగతము) ఇప్పుడు నే నొక చమత్కారముఁ బన్నవల యును. వీని నిజాభిప్రాయము నెఱుంగకయే యిచటి వృత్తాం తమంతఁ జెప్పిన నెటుబోయెటువచ్చునో తెలియదు. కాఁబట్టి యిందుకు సరిగా సమర్థించి చెప్పెద (ప్రకాశముగా) అయ్యా!

ఁగన్నాటక సూత్రధారియగు నా భగవంతుని రంగస్థలంబు
నఁ బ్రదర్శింపఁబడు పాత్రములన్నియు మాయాకల్పితము
లై యుండ నొక్క పశుదాంతమే మాయావినిర్మితమని చె
ప్పిన నాఁడే పొరపాటు.

**ఋతు**—(తలయూఁచి) మేలుమేలు లతాంగీ! మేలు. లేమవయ్యును
నీ వాడిన ప్రశస్తవాచకంబు లమృతతుల్యంబులు. పాత్రములు
యుక్తాయుక్త పరిజ్ఞాన పరాయణులగుట వారివారి పాత్రోచిత
పుణ్యఫలంబు నందఁగా దే? అదియటులుండనిమ్ము. నే నొక ప్రశ్న—

**లతాం**—అడుగుటకిది యదను కాదు. నీ నాలసించితి నేని నా కై వి
రించును.

**ఋతు**—ఎవరు ఎవరు?

**లతాం**—నా చెలిమిబోటి.

**ఋతు**—నీ చెలిమిబోటియా? సరే! ఆమె పేరు;

**లతాం**—మదనసాయక.

**ఋతు**—(సంతోషముతో) ఓహో! మదనసాయకా? నన్ను విరహా
నాగ్నిజ్వాలలఁ గప్పించిన మదనసాయకా?

గీ. మదనసాయకయని విన్న • మాత్రముననె
మదనసాయకములు నన్ను • మందగతిని
లోఁగ జేయుచునుండెనా • లోలనేత్రి
ఔరా! యభినవమోహిని • యనఁగ జెల్లు.

(లతాంగింజూచి) మంచిది. ఆమె యేల విచారించును?

**లతాం**—ఒంటరిగా నుండుటచేత, నామెంగొనివచ్చిన రాకుసుం
డెట్టి నిర్బంధము లొనరించునోయని.

**ఋతు**—(తనలో) ఈమె మాటలవలన నిచటి వృత్తాంతమంతయుఁ
దెలిసికొంటిని ఆ మదనసాయక నిశ్చయముగా నొక రాచ

బిడ్డ. దుర్మార్గుఁడగు తాళకేతుఁడే యామె నిటకుఁ గొనివచ్చి యీ సౌధంబుననుంచి యుండవచ్చును. ఇది నిస్సంశయము గా రాక్షస మాయాకల్పితాంతఃపురము. ఈ కాంత మదన సాయక సహచరియనుట నిజము. పాపమా రాజపుత్రిని విడు వఁజాలక యీయామెయు నిటకే తెంచినది. ఇప్పుడు నాయభిప్రాయ ముతప్పక యీ యామె నెరవేర్చును. (ప్రకాశముగా) కాంతామణీ! నీ ప్రియురాలు—

లతాం.—ఆ మాటయే మఱి నన్ను నడుగవలదు. మీ రిటు రాఁదగిన కారణమేదియో మా మదనసాయక మిమ్మర్థించి యడుగు చున్నది.

ఋతు.—అయోధ్యా పురాధీశ్వరుండగు శత్రుజిత్తునకు నే నాత్మజుం డను. రాక్షసుల బాధకోర్వక గాలవాదిమునులు మదీయ జన కుని పాలికేగి, కుయ్యిడఁ దదాజ్ఞకుఁ మారశార్థమై నన్ను నిపి యుండెను. నా పేరు ఋతుధ్వజుఁడందురు. తాళకేతుఁడను నొక రాక్షసునిం జంపి నిటువచ్చినాఁడను. ఇదియంతయు నీ చెలిమిబోటికి తెలింగించి మఱియు నిట్లు చెప్పుము. ఏమంటి వేని;

సీ. అసమానరూపన • యగుణకలాప య
యయ్యతిన కాశీర్వాద • మంటిననుము
కనుఁగొన్నదాదిగా • కంజాక్షిపై ప్రేమ
మత్యధికంబయ్యె • యలరెననుము
ప్రియవయస్యంగూడి • విలపించుచుండనా
కెంతయుఁ గనికర • మెసఁగెననుము
రాచబిడ్డలఁబట్టు • నీచాత్ముఁడీక మీఁద
నుర్వినపాగ్రణుఁడై • యుండఁడనుము

గీ. సకలసౌభాగ్యములు కొన • సాగుననుము
రేపుమాపును మఱి విచా • రింపకనుము
మనమునందున నామాట • మఱువకనుము
వేట్కమీర లతాంగివే • వేగఁజనుము.

నాయభిప్రాయము నీవు తెలిసికొంటివి. ఆ కార్యభారమునీయం దుంచితిని. ఏమంటివేని;

మ. అతివా! యేటికిదాఁపు నీ ప్రియవయ • స్యంజూచియత్యంతమా
సక్తిపై ప్రేముడివీడఁజాలక మన • స్తాపంబుచే నుంటి నే
గతిసంధించెదొ? యేమిచేసెదవొ యీ • కార్యంబునీయందనుం
చితి, వెన్దీయక తత్ప్రయత్నమిపుడుం • జేయింపు మజ్జాననా!
మఱియు,

చ. సకల సుఖానుభూతిని నొ • సంగిన యాచెలితోడికూటమిన్
సకియరో! వీడుచో మదన • సాయకయంచు నహర్నిశంబునున్
వికలమతిం జరించెద వి • వేకమెఱింగిన దానవౌట దాఁ
పకవచియించినాఁడను స్వ • పక్షపుఁ గార్యము నెట్లొనర్చెదో

లతాం—(తనలో) ఈతఁడు నిజముగా మదనసాయకా కటాక్షమునకుం బాత్రుఁడయ్యెను. ఇఁక నాపె మహాభాగ్యముల నందఁగలదు. (ప్రకాశముగా) అయ్యా! ఈ గొడవయంతయు మఱి వెలిబుచ్చకుఁడు. మీమాట లంమెతోఁ జెప్పెదగాని వచ్చిన కార్యమెద్దియో యది నిర్వర్తించుకొనుట మీకు విధికదా! కాఁబట్టి మున్ముందుగా యా తాళకేతుని బరిమార్చిరండు. తదుపరియోఁచింపవచ్చును. భావికాల ప్రసంగములతో నేమియుం బనిలేదు.

ఋతు—లతాంగీ! నీవాడిన మాట నిజము.

శా. ఆ నీచుం బరిమార్ప విశ్రుతమదీ • యామోఘబాహాబలం
బో నారీమణి! తేటతెల్లముగు నేఁ • డోరేపొ యా సాధ్వియున్.

న్యూనత్వం బొకయింతలేక నను న • న్యోన్యానురాగంబు న
న్నానించుగ్ దడవయ్యె వేఁజనియెదం • దత్కార్యమీడేర్చెదన్.

(నిష్క్రమింతురు)

# తృతీయరంగము.

—— : o : ——

పరివేశము, అంతఃపురోపకంఠము.

[అప్పుడు ఒకవైపునుండి తాళకేతుఁడు పరివేశించి]

తాళ—(కోపముతో) ఔరా! కామాంధా! విపక్షకంజపుంజకుం
జరుండనగు ననుందొడరవచ్చితివా?

మ. తులువా నీ మది భీతిలేకిపుడు నా • తో వచ్చుటేగాక యా
లలనంబెండిలి యాడనెంచితివి కా • లంబిప్డు నీ కబ్బెరా!

[ఋతుధ్వజుఁడు పరివేశించి]

నిలుమీ బాలిశ నీదుగర్వమడఁతున్ • నిస్తంద్రబాణక్రియా
కలితాస్మద్భుజ విక్రమంబునను లో • కంబబ్బురంబందఁగన్.

ఛీ! ఛీ! దురాత్మా! నీవింతకుఁబూర్వము నాతో నని యొన
ర్పంజాలక వెఱచి పాఱిపోయి మరల వచ్చుటచే నీకుగాలము
దాపురించినదని వేఱుగా నను నీనసక్కరలేదు. నీయిట్టిసామ
ర్థ్య మింకొకబలవంతుని కెన్నఁడు నుండఁబోదు. పౌరుషవంతు
డవైన నన్నెదిరించెదవు. లేదా చచ్చి వీరస్వర్గమునందినీ
పితృపితృవ్యుల క్షేమవార్తలం బరిశీలించెదవు. అంతేకాని,
వెనుకటివలెఁ బాఱిపోవ నీకైనను నీ పితామహునికైనను వల
నుపడదు. ఏమంటివేని;

(10 వ కీర్తన)

గీ. రాచబిడ్డలచెఱఁబట్టు • నీచమతివి
మునులఁబట్టి పల్లార్చిన • మూర్ఖమతివి
కనికరంబించుకయులేని • కలుషమతివి
నేఁడు రణరంగమున నిన్ను • నే వధింతు.

తాళ—అక్లోకానిమ్ము.

కం. మగవాఁడవు నీవైనన్
మగువనుగొంపోయిననన్ను • మరిగించివెనన్
నగరమునకుఁబోఁగల్గెడు
మగవాఁడవుగాకయున్న • మరిందెడువాచేన్.
(బాణము విడుచుచున్నాఁడు)

ఋతు—దనుజా! ఈ బాణముఁ గాచుకొనుము :(అనివేయును)

తాళ—హా! చచ్చితి. (అని భూమిపైఁబడును)

ఋతు—(పరిహాసముగా) "అత్యుచ్ఛ్రయః పతనహేతు" వనుటె
ఋంగవుకాబోలు. (అని నిష్క్రమించున్నాఁడు)

# తురీయరంగము.

—:o:—

[ మదనసాయక, లతాంగియుఁ బ్రవేశించి]

మద—(అట్టహాసముతో) లతాంగీ!

ఉ. తెల్లనిపుండరీకములు • తేజముకన్నులు ముద్దుమోము జా
బిల్లినిగేరు, కేలుఁగవ • విస్ఫుటసారసముల్, శిరోజముల్
నల్లన, రూపవైభవగు • ణమ్ము లగమ్యము, చెల్లఁబోననుఁ
మెల్లనవాతఁడంగభవు • మేటి విరాళినొనర్చి పోయెనే.

చెలీ! నన్ననంగ పరితాపమున కప్పగించి చనిన యా సాగ
సుకాఁడెవరు?

సీ. పుండరీక యుగమ్ముఁ • బోలు కన్గవవాఁడు
నవకంబుమించు కం • ఠమ్మువాఁడు
దినమణిద్యుతిఁగేరు • దేహకాంతిగలాఁడు
నాజానుబాహువు • లమరువాఁడు
పవిధారినీలముల్ • నవతు వేనలివాఁడు
యామినీపతిఁబోలు • మోమువాఁడు
మహితకంఠీరవ • మధ్యంబుగలవాఁడు
సరిలేని పీనవ • క్షంబువాఁడు
గీ. మందహాసముఁగుల్కు వా • జ్మయమువాఁడు
రిక్కలనుమించు నఖముల • రీతివాఁడు
నవల! యారాజ కొమరుఁడు • నన్నుఁబాసి
చనియెనక్కట! మృదువాక్య • సరణిఁరోసి.

లతాం—తొండరనొందకుము నీవచిరకాలములో సఫలీకృతమనోర
థవయ్యెదవు. సమగ్రవైభవ సమేతుండగు నా రాజకుమారుం
డు నిన్ను సమ్యగ్విధానంబునఁ బాణిగ్రహణం బొనర్ప నెంచి
యేతాదృశ మహాకార్యంబున కంతరాయము గలుగకుండఁ
గృతాపరాధియగు తాళకేతునిఁజంపి యిప్పుడే వచ్చెదనని
చెప్పి యేఁగెను. కావున నీక సందేహముకిడువుము.

మద—చెలీ! ఆతఁడు నీతో నేమైన మాటలాడెనా?

లతాం—ఏల మాటలాడలేదు? ఆతఁడునాతోఁచాలవరకు సంభాషించి
నీతో నిట్లు చెప్పుమనెను. (అని ఋతుధ్వజుఁడు చదివిన
"అసమానరూప" యను సీసపద్యము చదువును)

మద—సరే! అతని కులగోత్రములు బాగుగానడిగి తెలిసికొంటివా?

**లతాం**—తెలిసికొనఁ కేమి! కలదుగదా లోకవిఖ్యాతమగు నయోధ్యాపురము. ఆ పట్టణముం బాలింపుచుండిన శత్రుజిత్తు మహారాజుని కాయన కుమారుఁడు. మునులయాజ్ఞచే రాక్షసుల వధియింప నిల్లువెడలియుండెను. ఆతనివిశేష మవిచింత్యనీయము. (పరికించి) అదిగో! ఇప్పుడిక్కడికే వచ్చుచుండెను. చూడుము.

**మద**—(చూచి) ఆహా! ఎంతభాగ్యము. మదీయ పురాకృతపుణ్యసుమనోసురభిళము, నేఁడు పరిమళించినది.

[అప్పుడు ఋతుధ్వజుఁడు ప్రవేశించి]

**ఋతు**—(మదనసాయకంజూచి సంతోషముతో)

**మ.** అదెనాపాలిఁటి పారిజాతనగమా • త్మామోదపీయూషమ
య్యదియే, యైహికభోగభాగ్యనికరం • బాయింతి, స్వర్ధేనువ
య్యదె, వేయేటికమూల్య రత్నమది నా • కానందసంధాయియై
పదిలంబై యిఁటనుండెనౌరయిఁక నా • భాగ్యాబ్ధియుప్పొంగెడుఁ.
(సమీపించి) మనోహారిణీ!

**మ.** అతులామోదవతీ యశేషసుగుణా • యత్రైక సుశ్రీమతీ
శతపత్త్రేక్షణనిన్ను జూచి వలపుఁ • సైరింపఁగాఁజాల నట్
బ్రితిరోధింపక యేలుకొమ్మిపుడె • సౌభాగ్యంబుచేకూరునా
యతనుండుద్ధతినాపయింబరపెది • వ్యాస్త్రాళినోర్కుమ్మఁడిక్.
విదుషీమణీ! నిన్నుఁ గనుఁగొనినదాదిగా నే నేమిసేయుచుండినను నీరూపరేఖావిలాసములు నా కన్నులకుఁ గట్టినట్లుండి యొక్కింతయు నా మనస్సు నిలుకడలేక వాతోద్ధూత కుసుమ మంజరివలె చలించుచున్నది. వేయేల? నీవు నిజముగా నా మనోహారిణివి.

మద—(సిగ్గుచేఁ దలవంచుకొనును)

ఋతు—(నవ్వుచు) ఓహో! వ్రీడాభరంబున నుంటివా? అదిప్పుడే తొలఁగును.

సీ. సుదతీమణిరో నీదు • మృదుదరస్మితమెన్న
రమ్యమౌ శీతాంశు • రసముకాదె?
తులలేని సంతోష • మొలయింపనీముఖం
బలపూర్ణ చంద్రోద • యంబుకాదె?
దివ్యమౌ నీదు వా • తెఱబింబమీక్షించి
వర్ణింప నమృతార్ణ • వంబుగాదె?
ప్రతిభమై దృగాల • పర్వమై నీ శరీ
రము హేమసుందర • రసముగాదె?

గీ. సకలసౌకర్యములుగూర్పఁ • జాలునట్టి
తరుణి! నీపొందు భవ్య చిం • తామణిగదె!
యిన్ని తెరఁగుల నాకీ • యెలమినుండ
నిన్ను విడనాడి ప్రాణముల్ • నిలుపఁగలనె?

మద—(తనలో) ఈ మహాత్మునకు నా యందనురాగమగ్గలమౌటచే నిట్లనుచుండెను. అయిన నిప్పుడు కొంచముపశమింపఁజేసెదఁ గాక (ప్రకాశముగా)

శా. ఓ రాజన్యకుమార పాడియగునే • యొక్కింతకాలూఁదకే
జేరన్వచ్చెద విట్టిదే సరసమౌ • సీమంతి నీ రత్నముల్
భీరుల్ గాఁ గొచలింపరో పురుషులా • వీక్షించి యట్లౌట మీ
ధీరత్వంబిటఁజూపఁ జెల్లునొకొ బు • ద్ధింజాల యోచింపుమా.

ఋతు—(మందహాసముతో) అబలామణీ! బాగుగా నడిగితివి.

చం. జలజదళాక్షి నీపలుకు • సత్యమ కాముకులందు యొండొరుల్
గలయభయంబె దేహమది • కంపమునొందునె నూతనాంశముల్
బలికితి వెంత వెత్తివాఁ గొ • బాలవుగావున సౌఖ్యమెట్టిదో
తెలియనిదాన వౌటఁగడు • దీండ్రము సేసితి వక్కటక్కటా!

లతాం—(మదనసాయకచెవిలో నేదియో రహస్యము చెప్పును)

ఋతు—ఆ రహస్యమింక దాఁచక బయటఁ బెట్టనగును.

లతాం—ఆగు మాగుము.

ఋతు—అదేల ?

(11వ కీర్తన)

మద—మనోహరా !

చ. దనుజునిచేతఁజిక్కి తని • దద్దయు రోఁజుచునున్నయట్టి నా
జననిని తండ్రినిం గనఁగ • సమ్మతినెందితినట్లొనర్చి యా
యనుమతినొంది దక్షిణమ • యూడుఁడు పెండిలినిన్నుఁగానిచో
ఘనతరదావకీలఁబడి • గాలెదసంశయమింత లేకయేఁ.

ఋతు—వలదట్టి దారుణోక్తి వలదు. ఏమంటివా;

గీ. సంశయమునొందనేల నీ • జనకునకును
జెప్పియొప్పింతునిఁకజాగు • సేయనేల
రమ్ముపోదము మన మనో • రథముదీరె
సమదవేదండయాన • విశాలనయన !

మద—చిత్తము (అందఱు నిష్క్రమింతురు)

[యవనిక పడును]

గద్యము. ఇది శ్రీ రామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవిత్వ
గాంగేయగోత్ర పవిత్రాల్లంశెట్టి వంశపయః పా
రావార రాకాసుధాకర, సూరనాఖ్యతనూ
భవ, సూరనూంబాగర్భశుక్తిముక్తాఫల,
సకల సుధీవిధేయాప్పయనామధేయ
విరచితంబైన మదనసాయక నాట
కంబునందు ద్వితీయాంకము
సంపూర్ణము.





# మదనసాయకనాటకము.

## తృతీయాంకము.

[ ప్రవేశము, విశ్వావసుఁడు నయకోవిదుఁడు ]

విశ్వా—(విచారముతో) అక్కటా! నే నెంతటి యదృష్టహీనుఁడను. చిరకాలము సంతానలేమిం జేసి పరమేశ్వరుంగూర్చి తపం బొనరింప నమ్మహాత్ముండు ప్రసన్నుండై యొక పుత్త్రికారత్నం బు నా కొసంగె; నాఁటనుండియు నా విచారమంతయుఁ దూలిపోయినదని యపరిమితానందంబున బ్రొద్దులుపుచ్చుచు, తులలేని గారాబమున నా చిన్నిపుత్త్రిం బోషింపుచు, దినదినాభివర్ధనిగా నొనరించి పులి నోటికప్పగించినట్లు చేతులార యా నీచరాత్రించరున కప్పగించితినికదా! ఆహా! నే నేమి సేయువాఁడ? నా దుఃఖము నపనయించువా రెవరు? నా కే దైవము సాయపడును? హా! దైవమా! నీవు సయితము నన్నుపేక్షించితివా!

గీ. దైవమా నినుఁగూర్చి నే • తప మొనర్చి
గనిన సుకుమారిసద్గుణ • గణవిహారి
రక్కసునిచేతఁ జిక్కె నే • మిక్కుటంపు
బాధలొందుచునుండెనో • బ్రమసియేడ్చి.

నయ—రాజేంద్రా! ప్రాకృతిభంగి మీరిట్లు వాపోవనేల? ఊరడిల్లుఁడు.

మ. భవదీయాత్మజుఁబట్టినట్టి ఖలున • పాప్రిజ్ఞున్ దురాచారునిన్
జవసత్వంబునఁ ద్రుంచివైచి తనయున్ • సంధించి యే తీరుఁగా
నవనీనాయక సంశయించిమదివే • యాలోచనల్ సేయఁగా
నవియేలామనసైన్యమెల్లెడలఁ గట్టాయత్తమైయుండెడిన్.

విశ్వా—సచివవరా! మనమట్లనఁజనదు. ఏమనిన; రాక్షసులుమా యావినోదులు. వారెన్నియో యమానుషకృత్యములుగావిం పుచుందురు. కావున, నది యాలోచనముకాదు. అట్టియంశ ము భగవదధీనంబైయున్నది. ఇందువిషయమై మన యాలో చనమంతేయు నిష్ప్రయోజనము.

సేవ—(ప్రవేశించి) మహాప్రభూ! నమస్కారము.

విశ్వా—మంచిది. సేవకా! నీ విటురాఁదగిన కారణమేమి?

సేవ—మహాప్రభూ! దేవరవారికొక శుభవార్తఁదెలుపుటకు.

విశ్వా—(రిచ్చపడి) ఏమీ? శుభవార్తయా! ఏదో చెప్పుము.

సేవ—దేవా! ఆకర్ణింపుఁడు. అతఁడయోధ్యాపురముఁ బాలింపుచుం డిన శత్రుజిత్తు మహారాజునకుఁ దనూభవుఁడట. ఆతనిపేరు ఋతుధ్వజుఁడట. పితృవాక్యమవలంబించి యిల్లువెడలి దుర్మా ర్గులగు తాళకేతుఁడు మొదలగు రాక్షసులం దునుమాడి మీ కుమారినిటకుఁ దోడ్కొనివచ్చుచున్నాఁడు.

విశ్వా—(ఆశ్చర్యముతో) హా! ఏమిది ఆశ్చర్యము. సేవకా! ఇది నిజమా?

సేవ—ముమ్మాటికి నిజము.

నయ—దేవా! ఇది యాశ్చర్యముగనే యున్నది. అయిన దేవరవా రది కనుఁగొన నగును.

సేవ—(చూచి) దేవా! చూడుఁడు. వారిప్పుడే వచ్చుచున్నారు.

[అంతట ఋతుధ్వజుఁడు, మదనసాయకయుఁ బ్రవేశింతురు]

విశ్వా—హా! కుమారి! హా! మదనసాయక!

సీ. మముఁబాసినదిమొదల్ • మా తల్లిరో యెట్టి
కష్టములంబడి • గాసిలితివో?
నిముసంబుమమువీడ • నేరని సుకుమారి
నెటులొంటిమైజరి • యుంచినావో?
మాటిమాటికిమమ్ము • మదిలోఁదలంచి యే
లీలఁబ్రాణములిల్పఁ • జాలినావో?
ఆరామసీమయం • దక్కటా విహరింప
నిట్లబ్బెనని యెంత • యేడ్చినావో?
గీ. అమ్మరో నిన్ను రాక్షసుఁ • డడవినునిచి
నప్పుడెంతటి యాయాస • మందినావొ
యెఱుఁగమైతిమితల్లి నీ • యిడుమలెల్ల
నేఁడు తుదముట్టెనవిసుమీ • నిశ్చయముగ.

మన—జనకా! కడచినదానికై విచారించిన నేమిలాభము?

గీ. వసుధనేరికిఁబ్రారబ్ధ • వశముచేత
కష్టసుఖములునొకరీతి • గలుగకుండ
తారుమారగుచుండును • తలఁచిచూడ
చీఁకటియు వెన్నెలయుపోల్కి • బ్రాకటముగ.

గావున, నిందులకై విచారించియేమి సేయఁగలము? జనకా! నన్ను రాక్షసుని బాధనుండి తప్పించి ప్రాణములఁ గాపాడిన యీ సదయహృదయుని మూలమున నెల్లవృత్తాంతము మీరు వినగలరు. నేను నా నేత్రపర్వముగ నాకన్నతల్లిని, నన్ను బ్రేమించినతల్లిని, నన్ను కన్నుల నద్దుకొనుతల్లిని, సుగుణవల్లినింజూడ వేడుక జనించినది కావున నే నామెదరికేగెదను.

విశ్వా—అమ్మా! పోయిరమ్ము. పులినోటి కండవలె యెట్టెటోఁ బ్రతికివచ్చితివి. నా కదియే చాలును. నా కోరిక లీరికలెత్తినవి. నా చింతాగ్ని యంతమొందినది. నాభాగ్యము వర్ణనాతీతమయినది.

మద—(నిష్క్రమించును)

విశ్వా— (ఋతుధ్వజునిఁ గాంచి) ఆర్యాత్మజా! ఈ పీఠమునలంకరింపుఁడు.

ఋతు—చిత్తము. (కూరుచుండును)

విశ్వా—(మంత్రితో) సచివాగ్రణీ! నా కుమారిని రాక్షసబాధనుండి తొలఁగించి, నన్నానంద సాగరాంతర్నిమగ్నునిగా నొనరించిన యీ మహానుభావుని వృత్తాంతమిదివఱకే మనము వార్తాహరుని మూలమునఁ దెలిసికొంటిమికదా! ఇట్టి పరమదయాస్వభావునకుఁ గృతజ్ఞత నెఱపుట మన కకుంఠితకరణీయముకదా! దీనికేది యాలోచనము?

నయ—నిజము. మహారాజా! ఈతని ధైర్యస్థైర్యములు వర్ణనాతిక్రమణములు. అని తరసాధ్యమగు కార్యమవలీలగ నొనర్చిన యీతనికిఁ గృతజ్ఞతనెఱపుట మనకు విధి కావున నద్దానికై మన మాలోచింపవలసినదే;

విశ్వా—మంచిది (ఋతుధ్వజునిం గాంచి) అయ్యా! ఋతుధ్వజ! చిరకాలమునుండి నేననపత్యుండనై పరమేశ్వరుంగూర్చి తపంబొనరింప నద్దేవుండు ప్రసన్నుండై యొక పుత్రికారత్నంబు మాత్రము నా కొసంగె; నాఁటఁగోలె నా విచారమంతయుఁ దూలినదని యుప్పొంగుచుండ, నేడనుండియో యాతాళకేతుఁడువచ్చి యుద్యానంబున చెలిమిఁబోట్లతో విహరింపుచున్న నా కుమారింగని యాకస్మికముగ నెక్కడకో యెత్తుకొనిపో

వ, వాని వధింప నే ననేక పర్యాయములు కృతప్రియత్నుం
డ నైతిఁ గాని యది నాకు సాధ్యమయినదికాదు. నేఁటికి నీవు
నాయందు నిర్హేతుక కరుణాంతరంగుఁడ వై నా కుమారిక నొ
సంగి నన్నానదింపఁజేసితివి ఇంతకంటె వేఱుభాగ్యము నాకే
మున్నది.

చ. ఘనుఁడవు, పుణ్యమూర్తి వి, వి • కర్తనవంశవిధుండవట్లుగా
వున్ననె, మఱియపుత్రికను • పుణ్యచరిత్రను వంశపావనన్
బనివడిఁబెండ్లియాడుము, శుభంబగు నా వచనంబుమానసం
బునఁదలపోయుమెంతయు బ్ర • మోదము నీకగునో ఋతుధ్వజా!

నయ—(ఋతుధ్వజునితో) అయ్యా! మా యేలికమాట నంగీకరిం
పుఁడు.

ఋతు—అంగీకరించుట కేమున్నది? నా జననీ జనకులచెంత నట్టు
లానతి్చుట నా యభిప్రాయము.

నయ—అయ్యా! మీరట్లూహింపనేల? మీ వధూవరులఁ జక్కగా
నాశీర్వదింప మా రాజగారికెంతయుఁ గుతూహలమగుటచే
నట్లంటిరి. కాఁబట్టివారియభిప్రాయము వ్యర్థముగానీయకుఁడు.

విశ్వా—అయ్యా! ఈ నయకోవిదుఁడు వచించినది నిజము. ఏ మం
దువా?

ఉ. అల్ల దివాకరాన్వయుఁడ • వంచును సద్గుణశాలివంచు నా
యుల్లమునందు కూర్మిదళు • కొత్త వచించినవాఁడనయ్య, మా
యల్లుఁడ వైతివయ్య యిటు • లాడఁగ జెల్లునటయ్య, వేట్క సం
ధిల్లగనాదువాంఛితముఁ • దీర్చుము వేగముగా ఋతుధ్వజా!

ఋతు—తమరట్లానతిచ్చిన నే నేమిచెప్పుదును? మీ యిష్టానుసార
ముగావింపుఁడు.

విశ్వా—సంతోషము :మంత్రివరా! శీఘ్రముగా మన బంధువుల

నందఱికిని వివాహ మహోత్స వాహ్వాన పత్రికలంబంపి పుర
మంతయు నలంకరింపఁజేయుము.

నయ—దేవా! మహాప్రసాదము.

విశ్వా—(ఋతుధ్వజునితో) అయ్యా! పోవుదమురండు.

(అందఱు నిష్క్రమింతురు)

[ అప్పుడు ఒకానొక భటుఁడు ప్రవేశించి ]

భటు—అయ్యా! చెప్పలేదనేరు. వినలేదనేరుసుమండీ. మా రాజు
గారి కొమార్తె మదనసాయకను, ఋతుధ్వజుని కిచ్చి నిన్నటి
దినం పెండ్లిచేసినారు. వారిద్దరు రేపటిదినం అయోధ్యాకు
వెళిపోతారఁట. కాబట్టి, వారిని కొంతవఱకు సాగనంపుటకు
పట్టణంలో వున్నవారందఱు రావలసిందని రాజుగారి ఆజ్ఞ
అయిందిసుమఁడోయి. (పోవుచున్నాఁడు)

## ద్వితీయరంగము.

: o :

ప్రదేశము. గాలవ మున్యాశ్రమ సమీపము.

[ ప్రవేశము, ఋతుధ్వజుఁడు, మదనసాయకయు ]

మద—ప్రాణేశ్వరా! మనమిప్పుడెంతదూరము పోవలయును? సూ
ర్యోదయము కాకపూర్వమే బయలుదేరి యింత దూరము
వచ్చితిమికదా!

ఋతు—(మందహాసముతో) జీవితేశ్వరీ! పాపము. ఆ యరుణ కిర
ణుని ప్రచండాతపమున కోర్వఁజాలక యోసరిలి నీ విట్లంటివి,
కాఁబోలును.

మద—కాదు మీరోర్వఁజాలరేమోయని యట్లంటిని.
ఋతు—అటులననేల !

గీ. అఖిలలోక భయంకరుఁ • డైన తాళ
కేతుని వధించినప్పుడు • నా తనూవి
భవమొకింతయు వాడలే • దు వనజాక్షి
యిట్టి సూర్యాతపంబున • కే వెఱతునె ?

మద—నాథా ! ఆ తాళకేతునిమాట నాకిప్పుడు జ్ఞప్తికిందెచ్చి భయముగలిగింపక త్వరగా నడచిరండు. (నడచుచున్నారు)
ఋతు—కాంతామణీ ! అదిగో పశ్చిమదిశంజూడుము.

గీ. పచ్చగుఱ్ఱాలనెక్కిన • ప్రాభవుండు
కాలములుమూడుఁదెల్పెడి • ఘనయశుండు
పద్మబాంధవుఁడనుపేర • బరగువాఁడు
పశ్చిమాంబుధిఁబడెనూవె • పద్మనేత్రి !

మద—నాథా ! తూర్పుదెస నీక్షింపుఁడు.

సీ. తొలిదెసనాఁతి నా • థునిరాకఁగాంచి సం
తసమున నవ్విన • నవ్వదేమొ ?
గగనకాంతామణి • సిగఁదాల్చిన హారంగు
మణివి నిర్మితమగు • మండనంబొ ?
వాసవుచేనోటు • వడిపూర్వగిరిదెచ్చు
కలధౌతమయమగు • కలశమేమొ ?
అలపులోమజకవి • హరణార్థమైయింద్రుఁ
డిచ్చిన నిద్దంపు • టిల్లదేమొ ?

గీ. పుత్రుఁడుదయించెననుచు ను • ప్పొంగి జలధి
యూర్మ్ముల న్మించుడించిర • నో యనంగఁ
దూర్పుదిక్కున, ధవళిమ • దోఁచియంత

కంతకునుచంద్రుఁ డుదయించె • నంబుజాక్షి.

కావున, మనముజాగుసేయక పోవనెంచిన మునీంద్రాశ్రమ
మునకుఁబోయి, యీరేయిఁగడపి ప్రాతకాలముననే మన
నివాసమునకుం బోవుదమురండు.

**ఋతు**—అట్లెపోప్రదము. (అని నడచుచున్నారు)

[అప్పుడు శోకవిశోకులు ప్రవేశించి]

**శోక**—(విశోకునిఁజూచి) తమ్ముఁడా! నాగలోకముం బరిపాలింపుచుం
డిన అశ్వస్థునకుఁ గుమారులమై సర్పాకారంబులం జరించుచు
నాతఁడు మనపైఁ గొంచము కోపించెనని యిప్పుడీ నరలోకం
బునఁ గైతవంబగు నుసుష్యాకారధారులమైన మనల నెవ్వరుం
బోల్చుకొనియుండరుకదా!

**విశో**—అన్నయ్యా! మీరట్లననేల? మనుష్యమాత్రులు మన యా
కారంబులఁగాంచి గుఱుతుపట్టి సర్పములే యని మనల నను
కొనఁగలరా? ఇది యేటిమాట? మనల నెవ్వరుపోల్పఁగలరు.
ఈ ప్రదేశము ఘోర కాంతారమని నాకు తోఁచుచున్నది?

**శోక**—ఇది నిజముగా నిర్మానుష్య ప్రదేశమే; అయిన నిందు స్త్రీపు
రుషులిరువురి జాడమాత్రము గోచరించుచున్నది. వీరింగలసి
కొని సంభాషించినపిదప, నిమ్మహనీయునితో సఖ్యమొనరించు
కొని యేగ నూహించి యున్నాఁడ (అని ఋతుధ్వజుని సమీ
పించి తనలో) ఆహా! ఇమ్మదన మోహనమూర్తి యెవ్వఁడై
యుండనోపును? ఈతని ముఖలక్షణములం బరిగణింప, నల
కూబర, మీనాంక, శశాంకులీతని కొనగోటికైన సాటిరారని
నొక్కి వక్కాణింపవచ్చును. ఎన్నిభంగులనైన మే మీతని
తో సఖ్యమొనరింపక తనివితీరదు. (అని చేయిఁబట్టుకొని)
అయ్యా!

ఉ. మిన్నులుపడ్డచోటనక • మీ రిటురాఁగతమేమి వెంటనె
యన్నవ యేలవచ్చె, ముద • మారఁగఁదెల్పుఁడి మీ కులమ్మునన్
భ్యన్నతిఁదల్లిదండ్రులెవ • రో పురమెయ్యది మీకు మిత్రులై
యెన్నికఁగన్న సత్పురుషు • లెవ్వరొ మా కెఱిఁగింపుఁడీ దయన్.

ఋతు—(తనలో) వీరు బ్రాహ్మణాకారముల ధరించి మరల నన్ను మోసపుచ్చఁదలచిన నిశాచరులలోనివారై యుండనోపుదురేమో-కాదుకాదు. వీరు నిజముగా రాక్షసులయిన నా కుల గోత్రములు విమర్శించి యడుగ నేమియవసరము? వీరలెవ్వరయిననేమి? ఆ రాత్రించరులే యట్టి కపటవేషధారులయి సనగుదురుగాక. నా యుదంతంబు సవ్యాఖ్యానముగా వీరికె ఱింగించెదను. (ప్రకాశముగా) పూజ్యులారా!

మ. తనరన్ శత్రుజితాహ్వయుం డిలఁ బెల్లో • త్సాహసంబుగా వానికేఁ
దనయుండౌదు ఋతుధ్వజుండ మునులం • దర్శించి మద్రవ్యాదులం
దునుమాడన్ బనిపూని తెచ్చి నను గాలవుండు జే • తో ప్రీతిఁ బెంపొందియోఁ
జనుచున్నాఁడు మదీయ వేశ్మమునకున్ • త్సాహంబు దీపింపఁగన్.
అయ్యా! మీరెవరో యించుకంత నాకు తెలియపరచి కర్ణరసాయన మొనరింపుఁడు.

శోక—(విశోకునిం జూచి) అనుజన్మా! ఈ మానవోత్తముఁడు ధీనకులీనుఁడు. ఈతనితో మాయము సాగినపగిన మోసరింతుమేని మన యశంబుర్వీతలంబునఁ బెక్కువిధంబుల విరాజిల్లుచుండును. మనము కేవలము తెలిపోనులమని తెలిసిన నీతం డెలుక సహించునేమో; కానిమ్ము మనమీతనియెడల ఘాతుకత్వంబునకుం గడంగి యిట్లూహింపలేదుకదా! (ఆలోచించి) భూసురులమని చెప్పిన దోసమేమున్నది?

విశో—అన్నయ్యా! అది నాకు తెలియును. ఏదోయొక విధమూ
హించి నీవే చెప్పుము.

శోక—అయ్యా! ఋతుధ్వజ నామధేయ!

గీ. ధరణిమానవులందు ను • త్తములనంగ
నగ్రిజన్ములనంగ ప్రి • ఖ్యాతిఁగనిన
దే కులంబగు నయ్యది • మాకులంబు
చెప్పఁబనిలేదు వేఱుగా •

విశో—ఇదియుంగాక.

శా. అన్నా! నీకునుమాకు నేఁడుగద • సౌహార్దంబు చేకూరె నీ
కన్నంగాదిలిచుట్టమే మెఱుఁగమ • త్యాసక్తితో మమ్ములన్
జెన్నారంగని మైత్రిసల్పుఁడిటుపై • చిత్తానుసారంబుగా
నెన్నోసత్క్రియలెంచవచ్చు నిఁక వే • యేలా విచారించుటల్?

కావున, నిప్పుడు మాతో స్నేహ మొనరించినఁ జాలును. ప్రతి
దివసాంతమునను యుష్మన్నివేశమున కరుదెంచి సమయో
చిత సరససల్లాపంబుల యుల్లంబులు రంజిల్ల కొంతవడి ప్రొద్దు
పుచ్చనిట్లుంటిమి.

ఋతు—ఆర్యవర్యులారా! సంతోషము. ననుఁబోలు యపాత్రునితోఁ
బాత్రజ్ఞులరగుమీరు సఖ్యమొనరించుట నా కెంతయు సంతో
షము. (మదనసాయకం జూచి) యువతీమణీ! వీరి మాటలు
విశ్వసింపవచ్చునా?

మద—నాథా! నన్నడుగనేల? వసుంధరామరుల వాక్యములు విశ్వ
సనీయములని దలంపక యెవ్వరసంగీకారములని యూహిం
తురు? వారి యాజ్ఞ ననువర్తింపుఁడు.

ఋతు—మంచిది. ఓ ప్రియమిత్రులార!

కం. పరమేశ్వరుసాక్షిగ భూ
సురులారా మీదుచెల్మి • సుస్థిరమతినేఁ
డరమరలేక యొనర్చితి
చరితార్థుఁడనైతి నాదు • జన్మ ఫలించెన్.

శ్లోక-విశో—సంతోషము సంతోషము. మిత్రమా! మేమింక పోయి
వచ్చెదము సెలవిండు.

ఋతు—ప్రతిదినంబును మీరు నా సేమమరయ నయోధ్యకు దప్పక
రావలయునుఁడీ.

శ్లోక-విశో— తప్పక వచ్చుచుండెదము.

(అని నిష్క్రమించుచున్నారు)

మద—జీవితేశ్వరా! ఇంక మనమెంతదూరమేగవలయును?

ఋతు—ఇదిగో! ఇప్పుడే గాలవాది మానీంద్రులు వసియించు
తావునకు సమీపించితిమి; వేగముగా నడచిరమ్ము. (అని నడ
చుచు మునుల యాశ్రమంబుఁగాంచి) ఋషి సత్తములారా!

ఉ. సంతసమే మునీంద్రకుల • సత్తములార! తపంబులర్మిఁ గా
వింతురె? చింతలేక యర • విందదళాక్షునిఁ గొల్చుచుంటిరే
వంతయొకింతలేక బుధ • వత్సలతన్భవదీయ శిష్యుల
త్యంతముదంబు గూర్తురెయ • హర్నిశ మీరు సుఖంతురేకదా

[అప్పుడు గాలవాదిమునులు ప్రవేశించి]

మునులు—అర్కకులాభరణా! సంతోషము సంతోషము.

ఆ. వె. ఎఱచిదిండిపోతు • లెల్ల నిహతులైరి
మాకుభయములేక • మనఁగలిగితి
మన్న! నీ కటాక్ష • మున్న మా తపముల
కేమిటంకొఱంత • యేలగలుగు?

గాల—క్షత్త్రియకులదీపా ! ఋతుధ్వజ నామభూప !

ఉ. ఆగతి తాళకేతుఁడు భ • యాతురుఁడై వెనుదీసిపోవ నీ
వేగియు వానిఁగూల్చితివె • యెచ్చటికాతఁడు బోవుచుండె నీ
కీ గరిమంపుచెల్వ యెటు • లెచ్చటఁ జిక్కెను యీ యుదంతముం
బాగుగఁ దెల్పఁగోరితిమి • భానుకులాంబుధి పూర్ణచంద్రమా !

మఱియు, మేమిక్కడ

కం. సేమముగనున్న వారము
భూమీశ్వర ! మా తపంబు • పొసఁగుచునుండెన్
నీ మహిమచేత దనుజ
స్తోమము నిస్సరణమొందె • సూటిదలిర్పన్

ఋతు—మేలు మేలు మునికులోత్తమా ! సుజనాభిఘాతుండగు తాళ
కేతుండని మొనఁబ రాజయమొంది యొకానొక నిర్జనప్రదే
శమునకుం జని యచ్చట నా కగోచరుండయ్యెను.

మునులు—కొంపమునిఁగినది. ఇంక వాఁడు మమ్మేమి చేయదెంచి
యుండెనో ;

ఋతు—వానిజాడఁ బొడగానమింజేసి సంకోచింపుచుండ నంతకు
పూర్వమే యాతఁడు తెచ్చియునిచిన యీ కన్యకాలలామ
సౌధరాజం బీక్షించి వృత్తాంతమంతయుఁ దెలిసికొని తాళ
కేతుని వధించి విశ్వావసుఁడను నీమెతండ్రిగారి యాజ్ఞచే నీ
యిందుముఖిం బెండ్లియాడి యిటువచ్చుచున్నాఁడను.

మునులు—బాగుబాగు మంచిపనిచేసితివి. నాయనా ! దుష్టశిక్షణము
శిష్టపరిపాలనముఁ గాక్ష్యపీవరుల కకుంఠిత కర్తవ్యమని యెంచి
పడరాని ప్రయాసములంబడి తుట్టతుదకు కార్యసాఫల్యమొన
రించిన నీకు మేమెంతయుఁ గృతజ్ఞులము.

గాల—నాయనా ! ఋతుధ్వజ.!

గీ. తాళకేతునిఁగూల్చిన • తామసమున
వాని మిత్రులు మముఁజంప • వత్తురేమొ
నీవు జనుదెంచుచుండియు • నియతిమెరయ
నప్పుడప్పుడు మాసేమ • మరయుమయ్య!

ఋతు—నేను తప్పక జనుదెంచుచుండి, మీ యోగక్షేమము లారయుచుండెదను. నేనిల్లు వెడలిచాల దివసంబులాయె ఇంక నేఁబోవుచున్నాఁడ సెలవిండు.

మద—మునిందు్రలారా! మేము మా నిజనివాసమునకుం జనుచున్నాము. కాఁబట్టి, చక్కఁగా మమ్ముల నాశీర్వదింపుఁడు.

(అని నమస్కరించును)

గాల—అమ్మా! దీర్ఘసుమంగళీభవ. నీవు నీ నాథునాజ్ఞ నుల్లంఘింపక, అత్తమామల మనంబులు రంజిల్లఁజేసి, మాయట్టి మునిజనంబుల పాలిఁటి కల్పకంబువై యనువర్తింపుము.

ఋతు—మునులారా! మేమిదే పోవుచుంటిమి. మీరు మీ కార్యములం బ్రమోదంబున నెఱవేర్చుకొనుఁడు.

మునులు—నాయనా! పోయిరమ్ము (అని నిష్క్రమింతురు)

ఋతు—ప్రాణేశ్వరీ! తూర్పుదెసం దిలకించితివా?

సీ. ఆశావధూటిక • య్యామిరేందు్రఁడొసఁగిన
ˇగిబిగిజలతారు • చీరయేమొ?
ప్రళయకంఠేకాలు • ఫాలస్థలాంచిత
కీలికీలారుణా • భీలరుచియొ?
తమ్మిచూలిపయోజ • తతిఁగావనెత్తిన
వరసుధామయహేమ • పాత్రమేమొ?
బంధునస్నిముఁబిల్వ • ప్రార్థిశాంగనచేతఁ
బట్టిన కుంకుమ • బరిణయేమొ?
గీ. యనఁ గనరుణిమ కాంతిచే • నాకసంబు
భూమియుంగప్పి యిపుడు • పో కడంచి

భవ్యతరలీల భానుబిం • బంబుదోఁచె
తూర్పుదెసఁ దిలకింప సం • తోషముగను.

**మద**—నాథా ! అవును ఆ కారణముచేతనే,

సీ. చక్రవాకంబులు • జతఁగూడి చలరేఁగె
తామ్రచూడార వో • ద్ధతులు జెలఁగె
వెలచినకోరికల్ • వేసటఁ జింతిల్లె
పద్మాఘరోచులు • బరిఢవిల్లె
విరహిణీ జనమనో • విలసనంబులుదీరె
కైరవప్రకరంబు • ఘనతమారె
శుకపికశారికా • నికరముల్ కలఁబాతె
మునివితతియు స్నాన • మునకుఁ జేరె

గీ. కుముదబాంధవు పెల్లుబ్బు • గోలుపడియె
తారకలకాంతి యెంతయు • బేరుమాసె
దిక్తటంబుల రవికాంతి • తేజరిల్లె
నంతకంతకు సూర్యోద • యంబుదోఁచె.

**ఋతు**—మంచిది. మనమిప్పుడయోధ్యకుఁ బోవలయును రమ్ము.

**మద**—చిత్తము. (అని నిష్క్రమించుచున్నారు.)

[ యవనిక పడును ]

గద్యము. ఇది శ్రీ రామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవిత్వ
గాంగేయగోత్ర పవిత్రాల్లంశెట్టి వంశపయఃపా
రావార రాకాసుధాకర, సూరనాఖ్యతనూ
భవ, సూరమాంబాగర్భశుక్తిముక్తాఫల,
సకలసుధీవిధేయాప్పయ నామధేయ
విరచితంబైన మదనసాయక నాట
కంబునందు తృతీయాంకము
సంపూర్ణము.





శ్రీ

# మదనసాయకనాటకము.

## చతుర్థాంకము.

ప్రదేశము. ఉద్యాన వనము.

[ అప్పుడు, కమల, విమలయను చెలిమికత్తియలతో
మదనసాయక, యథోచితముగాఁ బ్రవేశించి ]

(12వ కీర్తన)

మద—చెలులారా! చెలువారు నీ యుద్యానవనంబుఁ గాంచితిరా? అదిగో! ఆ దెసఁజూడుఁడు. ఇప్పుడే వికసింపనున్న మల్లె మొగ్గలుగల తీఁగె దాపున, నల్లిబిల్లిగ నల్లుకొని మెల్లమెడల నవీన పరిమళంబులు వెదజల్లెడు చాంపేయకమను కుంజము.

కమ—(సమీపించి) అమ్మా! ఈ హాటక పుష్పమేదురంబగు నికుంజంబెంతయు మనోహర పరిమళంబుచే నెగడియున్నది.

మద—(విమలఁజూచి) విమలా! నీవు చూచితివా?

విమ—(సమీపించి) చూచితినిగాని యీ సంపంగిపొదపై నొక్క తుమ్మెదయైనఁ గానరాదేమమ్మా?

మద—అదిగో! ఆపారిజాతకుసుమంబుపై నెన్ని తుమ్మెదలున్నవో చూడుము.

విమ—ఆ మాటయేల? పారిజాతకుసుమ మకరందంబుఁ గ్రోలెడి

యుందిందిరమేల యీ సంపంగిపూవుల నాశ్రియింపకూడదు ?
సంపంగియందు మకరందము ందా ?

కమల—మకరందమున్నదో లేదో నీవు చూచితివా ? సంపంగియం
దొక దుర్వాయువు కలదనియు, ఆ వాయువువలన వాటి
కసాయము వాటిల్లుననియు, తుమ్మెద లెప్పుడా చెంత నేనిలు
వవు.

విమ—బాగుగా సమర్థించితివే ; నీకు మంచివారితో మాటలెట్లు
రుచింపవో అట్లె తుమ్మెదలకు సంపంగిపువ్వుల తావి సహిం
పదని నీ మాట నీవు చెప్పుకొనుచున్నట్లున్నది. అన్యాపదేశ
ముగా వెల్లడించిన నీ చమత్కారమునే దెలిసికొనలేదను
కొనకుము.

కమ—ఎందుకట్లు త్రివ్వి తలపోసి కొనియెదవు? నే నాడినమాట
యొకటి నీ యర్థమొకటి. (మదనసాయకం జూచి) చెలీ ?
ఇందు నా తప్పేమయిన నున్నదా.

మద—నీ మాటలో నేమియుఁ దప్పితములేదు.

విమ—అమ్మా ! నా మాటయందేమయిన తప్పితముకలదా ?

మద—కొంచమయినను లేదు.

విమ—ఏమిటి ?

మద—తప్పుతప్పు.

విమ—నాయందు తప్పులేదు సరేకదా ! దీని పలుగాకితన మెందుకు?

కమ—ఓసి ! పలుగాకి ! పలుగాకి ! ముమ్మాటికి పలుగాకివి నీవే.

మద—(తనలో) వీరి జగడము బాగుగనే యున్నది. ఈ నాగరికతా
ప్రపంచమున బొత్తుగాఁ దెలివిహీనులయినను మంచియో చెడ్డ
యో నాలుగు మాటలు బింకముగా నాడిన నెట్టి పండిత
శిరోమణులనయిన ధిక్కరింపవచ్చునుకదా ! ఈవిమల యీను

వాక్యముల నా దరణీయములయినను దృఢీకరించి బలుకుటచే గ్రంథములందు సంపూర్ణ పరిశ్రమముగల కమల యేమియు మాటలాడకున్నయది. దీని నిప్పుడు మందలించి చూచెదను. (ప్రకాశముగా) విమలా! నీ నర్మగర్భపుంబలుకు లింకచాలిం పరాదా చాలసేపయినది.

విమ—అమ్మా! నీ మాటనమ్మి నే వచ్చినందులకు బాగుగా పరాభవించితివి. ఇదియే నా రాజకాంతల నైసర్గికము ?

మద—చెలి! మితిమీరి మాటలాడెదవేల? నీవు మందబుద్ధివి కావు. కుశాగ్రబుద్ధికలదానవు. నీకు నేను సమాధానముచెప్పెద నిటురమ్ము. (అని చేయింబట్టుకొనును)

విమ—ఏమి సమాధానము? మఱియొకతూరి మే మిట్లనుకొనుటయే తరువాయి యున్నది.

మద—నీ ప్రశ్నకు ఫలితార్థముం జెప్పుచున్నాను. తుమ్మెదలెందుకు సంపంగిపొదం జేరవనిన, సంపంగిపుష్పపరిమళము నాఘ్రాణించినమాత్రముననే, తుమ్మెద మరణించును. ఇదియే కారణము.

విమ—ఈ మాట నాకు తెలిసినదే కాని నీ వెట్లు చెప్పుదువో తెలియుటకై యడిగినందుకు కమల నన్ను నిందించినది.

కమ—నే నొకరిని నిందింపను. కాని చూతను. నీవే దిక్కని పాదములపైంబడను. నన్ను మన్నించువారిని నేను గౌరవింతును. నన్ను దిరస్కరించువారిని గటకంటనైన చూతను.

విమ—(తనలో) ఈ వట్టి నేరానేము చెప్పరాదుగను.

మద—సకియురాలా! ఇంక మీ వ్యర్థవాక్యములుచే గాలమూపవమొనరింపక ఇటురండు. ఇందుకంతసేపు వ్యాసపదము మొనరించి పోవుదము.

కమల-విమల—అట్లే గావింతము. (అని పూలుంగోయుచున్నారు)

మద—(విచారముతో) చెలియలారా! నేఁడేలకోగాని నా శరీరము నందించుకేనియు చైతన్యము లేదు. ముందువేయనున్న యడు గు వెనుకకుం జనుచున్నది. నా మనంబు మిగుల నార్తిము నొందుచున్నది. భయమధికము గుచున్నది.

(అని యూరకుండును)

కమ-విమ—(భయమభినయించి) ఏ మమ్మా! కారణమేమి? కారణ మేమి?

కమ— గీ. ఇంతవఱవకు మాతోడుత • సంతసమున
మాటలాడియు నిప్పుడు • మాటలాడ

విమ— వకట! నీ విట్లు బల్కక మా • కమితమైన
భయము గలుగుచునున్నది • పద్మనేత్రి.

(కమలంజూచి) కమలా! ఈ మదనసాయకకు భర్తృవియోగ సంజనితవిరహతాపమని నేఁ దలంచుచున్నాను.

కమ—ఏమీ! ఈ మెభర్తగా గంటివస్సను లేరా!

విమ—ఓయ్యో! నీకు తెలియదా! వారు నిన్ననే గాలవాది మా నీందుల దర్శింపఁజనుట.

కమ—అవును నేనే మఱచితిని ఆ కారణముచేతనే యీమె నిన్నటి నుండి సరిగా భోజనమైన నంగీకరించుటలేదు. ఇఁక కురులు సవరించుటలేదనుమాట చెప్పనేల? (మదనసాయకం జూచి) చెలియా! మనమింక నిందుండఁజనదు. ఇప్పుడే అంతఃపురము నకేగి నీకు శైత్యోపచారము లొనరించెదమురమ్ము.

మద—(లేచి) అయ్యో! ఈ యుపచారములు నా కేల? నా తను లత వడంకజొచ్చుచున్నది. ఇది యేమగునో నాకు దోఁచకు న్నది. శీఘ్రముగా రాణివాసమునకు రండు.

**కమ-విమ**—అయ్యో! ఎంతపనిజరిగెను.

(అని అందఱు నిష్క్రమించుచున్నారు)

[ అప్పుడు ఒకవైపునుండి తూర్యకేతుఁడు ప్రవేశించి ]

**తూర్య**—(కోపముతో) మా యన్నగారిని సంహరించిన పాపాత్మున కిది యిల్లాలై యుండనోపును. దీని మగఁడు గాలవమునిం జూడబోవ, నేను మునివేషధారినై మాయఁబన్ని వానికంఠహారముఁగొనివచ్చితిని కదా! ఈ కంఠహార విశేషమొకటుంజూపి, వాఁడు రాక్షసులచే మరణించెనని, యుక్తియుక్తముగఁ జెప్పి యే విధముననైన నీమె ప్రాణములు బాపికొనెడి యుపాయము గావించెదను. పిమ్మట దీని మగఁడు సతిమృతికై సంతాపించి యంతమొందక మానఁడు వాఁడంతరించినఁగాని మా రాక్షసకులం బెప్పటివలె నవిచ్ఛిన్నదర్పాతిరేకంబున దొప్పఁదోఁగదు (యోచించి) కానిమ్ము నేనిప్పుడే మునివేషధారినై యీమె నివసించు నంతఃపురంబు సొచ్చి చేయఁదలఁచిన కపటోద్యోగంబు, తనివిదీరచేసి తీరెదగాక.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

[ యవనిక పడును ]

[ అప్పుడు ఘటోదరి బహిరంగముగాఁ బ్రవేశించి ]

**ఘటో**—(తనలో) అయ్యయ్యో! నేఁడు మా రాక్షసకులంబున కెట్టి దుస్థితిసంభవించినది నిరాతంక వ్యాపారలీలాపరాయణుండగు మాబావ, తాళకేతుఁడొకానొక మనుష్యమాత్రునిచే నిహతుఁడయ్యెనా? ఎంతచిత్రముగ నున్నది. కంఠీరవంబుతో సారమేయంబు దలపడి పోరాడినట్లున్నది. (పైకిచూచి) ఔరా! పాపపుదైవమా! నీయందు మేమేమి ద్రోహచింతన

మొనరించితిమని మాకిట్టి దురవస్థఁబ్రాప్తింపజేసితివి? మా వంశమునందు జన్మించినవారు నీవే దేవుఁడవనియెంచి, నిన్నుఁ బ్రార్థింపుచుండ దయామాలుఁడవై నరంబులొసఁగుటలేదా! తొ ట్టతొదకు నీవరములన్నియుఁ గాల్పంబడియెనా? నీ కపటో పాయ మిప్పటికి మే మెఱుంగజాలితిమి. మహాబాహుబల సమన్వితులగు రాక్షసులేడ, దుర్బలులగు నరాధములేడ, జయించుటెక్కడ? ఇదియంతయు నీవలననే కలిగినది. మా రాక్షసకులంబంతయు నామమాత్రావశిష్టంబైనది. హత శేషులు కాందిశీకులై పాఱిపోయిరి. ఇఁక మాకు తెరువెద్ది యుఁ గానరాకున్నది. ఔరా! మనుజాధమా! మా సంచా రముఁగాంచి లొట్టలువేసి పాఱిపోక, ఎదిరించి కదనంబొన ర్చి మా బంధువర్గముం జెఱబట్టిన నీ వెవ్వఁడవు? నీ విఁక ప్రాణములతో నుంటివిగా! ఆగు మాగుము. నాఱుకాకుల భుజించిన రాబందుక కొక గాలివాన రాకపోదు. (పరికించి) అదిగో! నా భర్త తూర్యకేతుఁడిటకు నవ్వుచు వచ్చుచున్నా డు. పర్యవసాన మేమెదో తెలిసికొనియెదగాక.

[ అప్పుడు తూర్యకేతుఁడు ప్రవేశించుచున్నాఁడు]

తూర్య—(సంతోషముతో) భళిభళీ లోకములో నొకనికి మోసవు చ్చినవాఁడు తప్పక మోసపోవుట, నేఁడు తార్కాణమైనది.

ఘటో—అయ్యో? ఏమట్లంటివి? సమస్త మునిజనంబులకు భంగపా టుగలిగించిన మన కపాయముగలిగినదని విచారమునకు మా రుగా సంతోషముతో నీ విప్పుడిచటికివచ్చుట నా మనంబు తత్తరపడుచున్నది ఆ రాజాధములచే మీ యన్నగారు మృ తినొందినందులకుఁ గార్యసాధన మేమైన నాలోచింపక వ్యర్థ ముగా సంచరించిన, లాభమేమున్నది?

తూర్య—(నవ్వుచు) ఓహో! నీవింక నిద్రించుచునేయుంటివా? మా యన్నగారిని వధించిన మానవాధముఁడిప్పుడే మరణింప నున్నాఁడు. వానిభార్య యిదివరకే మరణించెను.

ఘటో—(ఆశ్చర్యముతో) ఏమి యీ యాశ్చర్యము. ఆ దురాత్ముఁడు మరణింపనున్నాఁడా వానిభార్య యిదివరకే మరణించెనా? ఈ యుదంతము బహు వింతగనే యున్నది. నీ వేమిచేసితివి?

తూర్య—అయ్యో! నీవు బొత్తుగా వివేకహీనురాలివలె నున్నావే నే నొనరించిన కార్యక్రమ మించుకంతయు నీ కెఱుకపడ లేదా?

ఘటో—నా కెట్లుతెలుకపడును? నీవు చెప్పినగదా! తెలిసికొనుట.

తూర్య—మా యన్నగారిం బరిమార్చిన ఋతుధ్వజుఁడు మునుల యాజ్ఞప్రకారము పాండవతూరి గాలవాదులం దర్శింప యథా ప్రకారమున నరణ్యమున కేగియుండెను.

ఘటో—అవును. ఆ రాజు మునుల దర్శింప నరణ్యములకుఁ బోవుట మన ప్రాణములూడఁదీయుటకే; కానిమ్ము నిన్నాతఁడు గాంచి విగతాసునిగా జేయక ప్రాణములుంచివేసెనా.

తూర్య—నా ప్రాణములూడఁదీయుటకు వానికికాదు వానిఁబుట్టించిన బ్రహ్మకున్నైన వశమా?

ఘటో—అవునని నిజమే; పిమ్మట మాటచెప్పుము.

తూర్య—పిమ్మట నే నాతనిఁగాంచి, భయకంపిత మానసుండనై, చేట్ల కేలకు దిట్టపేర్చుకొని, గుట్టుచెడక, గట్టిగా బూడిదబూసి కొని, యొక చెట్టునీడను మునీంద్రాకారమున విశ్రమించితిని.

ఘటో—బాగుబాగు దొంగయింట మంచము వేసినట్లు చేసితివి. తదుపరి వాఁడేమిచేసెను?

తూర్య—తదుపరి నన్నాతఁడు వీక్షించి నిజమగు మునీంద్రుఁడనని

యర్ఘ్యపాద్యాది విధులం బూజించి, నా సెలవుకై గాచియుం డెను.

ఘటో—ఇఁక మఱిచెప్పనక్కఱలేదు. కుక్కకాలు మందనినఁ గొయ్యయెక్కి నిలుచుండదా? తరువాత.

తూర్య—తరువాత, నే నాతనిఁగాంచి, ఓయీ! నీ మెడలోని ముత్యాలహారము నా కొకసారియిమ్ము దానిని నే ధరించి వరుణునారాధింప సరస్సునకేగి వచ్చెదనని నక్కవినయము లాడి మెల్లన నా హారము నంకించుకొంటిని.

ఘటో—మంచిపనిచేసితివి. ఏదీ నీ మెడలో నది యిప్పుడు లేదుకదా! ఎవరికిచ్చినావు.

తూర్య—ఆ ముత్యాలహారము నా మెడనలంకరించుకొని, నే వచ్చువఱకచ్చటనే యుండుమని చెప్పి వాఁడు చూచుచుండగనే సరస్సునమునిఁగి యదృశ్యుఁడనై వానిభార్య నివసించు సౌధంబున కేగి, యామెభర్త రాక్షసులతో యుద్ధమొనరించి పరలోకగతుఁడయ్యెనని తెలిపి యానవాలుగా ముత్యాలహారమొసఁగి శోకిల్లకుమని చెప్పితిని.

ఘటో—బాగుబాగు తరువాత నామె యేమైనది?

తూర్య—పాపము ఆమె పతివ్రతాశిరోమణి కాఁబోలు నే నా ముత్యాలహారము చేతికిచ్చినతోడనే భోరు భోరున నేడ్చుచుఁ బ్రాణములు విడిచినది.

ఘటో—హా! నిజముగా బ్రాణములు విడిచినదా? ఏమి, ఈమెపాతివ్రత్య మాహాత్మ్యము. ఆమెభర్త తిరిగి యింటికిపోయి, సతి మృతికై విచారించుచుండెనుకాఁబోలును.

తూర్య—విచారమా, మఱి విచారసాగరమా, దరిలేనిదుఃఖాంబుధిని మునుఁగుచుండెను.

ఘటో—అయితే, ఆమె మరణించుట నీ వలననే యని యెఱుఁగడు కదా !

తూర్య—వాఁడెట్లెఱుంగగలఁడు ? నే నెప్పటివలె నది నుండి బయటి కివచ్చి, నీవు నాకు మహోపకారమొనరించితివి. నీవలన నాకు వరుణుండు ప్రసన్నుండయ్యె. నీకుఁ దగు ప్రత్యుపకారమే నెట్లొనరించువాఁడనని చెప్పి యాశీర్వదించి, వాని కంఠహార మప్పుడే యిచ్చివేసితిని.

ఘటో—(సంతోషముతో) బలె రాక్షసులు మా యీ వినోదులను నామము సార్థకమునకుఁ దెచ్చితివి. ఇంతేచాలును. మనపాటు నీటఁగలిపినవాని దురదృష్ట మీక్షించుచుండెదము రమ్ము. సాయంకాలమైనది.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు)

[ ఇది విష్కంభము ]

రంగము—రాజమందిరము.

[ ప్రవేశము :- శత్రుజిత్తు, వినీతుఁడు ]

శత్రు—(విచారముతో) మంత్రివరా ! నేఁ డంతఃపురమున జరిగిన విచారకరమగు కార్యము నీ వెఱిఁగియుంటివికదా! మన ఋతుధ్వజుఁడు రాక్షసులచేఁ దునుమబడెనని యొకానొకముని, యానవాలుగా నాతని కంఠహారముం గొనివచ్చి మదనసా యకకుం జూప నిముషమాత్రముననే యామె మరణించినది అనన్యసాధ్యుఁడగు మన ఋతుధ్వజుఁడు రాక్షసులచేఁ జిక్కె నని నేను నమ్మజాలకున్నాఁడను. ఎవఁడో యొక దుర్మార్గుఁడిట్లు కపటోపాయ మూహించి, నిష్కారణముగా నామెను పంచ త్వ మొందించినాఁడు.

విని—దేవా! అటులోనర్చినఁడెవఁడో యననేల? వాఁడు తాళకేతు ని తమ్ముఁడై యుండవచ్చును. రాక్షసకులంబెల్ల కూఁకటిప్రే ళ్లతోఁ బెకలిన్చుచుండిన యీతనికిట్లు చేసెదమని వాఁడెం చి జరిగించినపని (పరికించి) అదిగో! ఋతుధ్వజుఁడిటువచ్చుచు న్నాఁడు. ఇతఁడీవృత్తాంతము విని, ఎంతవిచారించునో తెలి యదు.

[ అంతట ఋతుధ్వజుఁడు ప్రవేశించి ]

ఋతు—(తనలో) అక్కటా! నా వామనేత్రమదరుట కొక యమం గళము సూచించుచున్నది. కారణమేమో తెలియకున్నది. నన్నుఁజూచి నా జనకుఁడు ఖిన్నుఁడై మోము వంచుకొని యుండి, అమాత్యుఁడు నాతో నేదియో చెప్పనెంచియున్నట్లు తెలియుచున్నదేమి చెప్పుమా (ప్రకాశముగా) వినీతుఁడా! నా తండ్రి విచారించుచున్నట్లున్నది. నే నాలసించితినని యేనా?

విని—కాదు.

ఋతు—మఱేమి కారణము?

విని—కారణమున్నది.

ఋతు—కుమారుఁడనగు నాతోఁ జెప్పకూడదా?

విని—నీనుండియే విచారించుచుండిన మఱి నీతోఁ జెప్పుటెట్లు?

ఋతు—ఏమీ, నానుండి విచారమా? నేనేమిచేసితిని?

విని—కాదు నీవు విచారించుదువేమోయని యతఁడు చింతించుచుం డెను.

ఋతు—ఏమేమి, నేనింటికియొద్దను లేనిసమయమందేమైన జరిగియుం డెనా.

విని—(తనలో) అక్కటా! నే నిప్పుడీ కర్ణకఠోరమగు వార్త యీ తనికి తెలియజేయుదుమన్న నోరాడకున్నదికదా?

ఋతు——అయ్యా! నన్నిట్లు కలంతజెందించెదవేల? ఆ మాట యేది యో చెప్పఁగూడదా?

వినీ——మీ మెడ నలంకరించెడి ముత్యాలహార మిదివఱకెవ్వరికైన నిచ్చియుండిరా?

ఋతు——నే నరణ్యమున కేగుచుండ మార్గమధ్యమందున్న యొక మునీంద్రున కది యిచ్చి మరల గ్రహించినాఁడను అయినం దానివలన నేమికలిగెను?

వినీ——అదియే యింతకుఁ గారణము.

ఋతు——(స్వగతము) అన్నన్నా! వాఁడు నిజమైన మునిసత్తముఁడు కాఁడేమో! వాఁడిక్కడకువచ్చి యేమేమో చెప్పి యుండవచ్చును (ప్రకాశముగా) అయ్యా? వాఁడు నా ముత్యాలహార మెవ్వరికి గనుపరచినాఁడు

వినీ——మదనసాయకకు.

ఋతు——ఛీ! ఛీ! దుర్మార్గుఁడెంతపనికి నెట్టుకొనెను. కానిమ్ము. పిమ్మట మదనసాయక యేమయినది?

వినీ——మీరు మరణించిరనిచూపిన దూనవాలుంగని యామెయు——

ఋతు——మరణించినదా?

వినీ——మఱి నా నోరాడదు.

ఋతు——హా! ప్రాణేశ్వరీ! (అని మూర్ఛిల్లుచున్నాఁడు)

శత్రు-వినీ——(లేవదీసి) నాయనా! విచారింపకుము విచారింపకుము.

ఋతు——(విచారముతో)

ఉ. హా! యువతీలలామ జల • జాయతలోచన హా! మదిష్టసం
ధాయిని, హా! శశాంకముఖి • న్యాయమె నన్విడనాడ? నెవ్వడో
మాయయొనర్చెనంచకట • మానసమందుఁ దలంచకీవు నీ
కాయముఁబాసియేఁగి కడు • కాలమునన్నిటు గుందజేసితే.

సీ. దరహాసచంద్రికల్ • దళుకొత్తు నీ మోము
సుదతిరో! కన్నార • చూడనైతి
నేకాంతమున నీవు • శోకించెదవటంచు
నయ్యో! బిగ్గరగ మా • టాడనైతి
తనివిదీరంగ నీ య • ధరపాన మొనరించి
లీలసంతోషాబ్ధి • దేలనైతి
నవ్యక్తమధురస్వ • నాంచితవాణివై
దనరు నీమాటల • వినఁగనైతి
గీ. అకట! ధృతిదూలి, మతిమాలి • యంశుమాలి
వంశమునఁబుట్టి యీ రీతి • నగనవల సెఁ
గాంతరో నేను నీ మోము • గాంచఁగలనొ
గాంచలేనొ కో మోహనా • కారి యింక.
హా! శంపాలతావిగ్రహా! హా! కుందరదన! హా! ఇందువ
దాలక! హా! వైసారిణాక్షి!
గీ. మదనసాయక! మదనసా • మ్రాజ్యలక్ష్మి
నన్ను విడనాడిపోనీకు • న్యాయమగునె? (ఖడ్గముఁబట్టి)
ఖడ్గమా! నీవు నాయందు • కరుణగలిగి
మదనసాయకఁ జూపుము • మఱువకిపుడు.

(నఱుకుకొన నెంచును)

[అప్పుడు శోక, విశోకులు ప్రవేశించి]

(13వ కీర్తన)

శోక-విశో-మిత్రరత్నమా! ఆగు మాగుము. (కత్తిఁబట్టుకొని) అయ్యో!
ఈ యసిధారచేఁ బ్రాణములూడదీసికొను నంతటి యగత్య
మేలకలిగెను? ఇట్టి దారుణకృత్య మొనరింపఁ గతమెయ్యది

ఇదియుం గాక, ఒకానొకప్పుడాకస్మికముగ నెద్దియేనియసంభవ కార్యము సంభవించినను, మిముబోంట్లు ప్రాజ్ఞులు దానికై విచారించుటయేగాక, ప్రాణత్యాగమునకుంగూడ, నిచ్చగింతురా? ఎంత పొరపాటుపనిం జేయంబూనితిరి. ఈ వార్త లోకులాకర్ణించిన, నవ్వుదురు. మీరిట్లు వగలంబొగలకారణ మెద్దియో మాకెఱింగింపుఁడు.

వినీ—ఆర్యపుత్రులార! దయచేసి యిచ్చటం గూర్చుండుడు.

శోక-విశో—(కూర్చుందురు)

ఋతు—మిత్రులార!

గీ. జాయగతియింపెననుచు వి • చారజలధి
మునుఁగుచుండిన మీ మిత్రు • ననునయింప
నరుగుదెంచిరె కాంబోలు • నన్నలార!
యేమిచెప్పుదు నా స్థితి • యిట్టులుండె.

శోక—(చెవులుమూసికొని) శ్రీహరీ! ఎంతమాటవింటిమి? (శత్రుజిత్తుంజూచి) అయ్యా! ఈ కార్యమెట్లుజరిగినది? దైవఘటన మెట్లుమారినది? మాకించుకంత తెలియనిండు.

శత్రు-అయ్యా! ఈతఁడు గాలవమునింజూడ రెండవతూరి యడవికిబోవు మార్గమున మునివేషధారియై యొక రాక్షసుఁడీతని కంఠహారముంగొని, యవాచ్యములాడి, మదనసాయకకుంజూప, యా మెనిజమని నమ్మి భోరున నేడ్చి మొదలునఱికిన కదళీతరువు వలె నేలఁగూలెను. ఈతని విచారము మాన్ప నాకు శక్యముగాకున్నది. ఇఁక నేఁ బోయెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

విశో—(వినీతునితో) ఆ దురాత్ముని వెంటనే కారాగార నివాసునిగా నొనరింపకపోతిరా?

వినీ—అయ్యో! నిజస్థితి మాకిప్పుడీతఁడు వచ్చినఁగదా తెలిసినది.

శోక—ఆహా! ఏమి యీమె మాహాత్మ్యము. భర్తృమృతి వినినతోడనే మరణించినది.

చ. పతిమరణించెనంచు దన • ప్రాణములన్ విడనాడినట్టి యీ
యతివనుబోలు నుత్తమ కు • లాంగనలన్మతి నెందుఁగాన మీ
విశో-యతివయొకర్తుదక్క-పర • మాద్భుతును య్యేవిధాత్రవ్రాఁత యీ
గతిఁగలుగంగ నేరిన న • గా బనిలేదు విచారమేటికిక్.

మిత్రమా! సర్వంబుఁదెలిసిన మీ విప్రాజ్ఞునివలె విచారించె దరేల? ఊఁఅడిల్లుఁడు, "జాయతేమరణంధ్రువమ్మ"నెడి సామవచనంబులు మీకు తెలియనివికావు.

శోక—మిత్రమా!

కం. సతిమరణించెనటంచును
మతిచెడి విలపింప నీకు • మంచిదియే యీ
క్షితినెవ్వరైనఁ గడున
స్మతిఁగలకాలంబుదనుక • మనియుందురే?

ప్రాణులకు సుఖదుఃఖంబులు నైసర్గికంబులు. మఱియు, బుద్బుదసన్నిభంబగు నీ హేయకాయంబు స్థిరమనినమ్మి, నినుబోలు ప్రాజ్ఞులే, మోసబోయి పరితపించిన, లోకాపవాదముకాదా? ఈ విచారముడిఁగి యూఱడిల్లుము.

వినీ—ఋతుధ్వజా!

మ. సతమెవ్వారికిఁగాదు కాయము, సము • స్తంబుర్వి నిర్యాతమా
మతిమంతుండవునీవెఱుంగవె? బుధా • మాత్యుల్వినంగొల్వులో
సతికైయేడ్చుట నాదబాడియె? వృథా • సంకల్పమింకేల, నో
క్షితినాథాగ్రణిపుత్ర! ఖిన్నమతివై • చింతింప నీకేటికిక్.

అదిగో! ఆ వైపు చూడుము. మహాత్ముఁడగు నారద మానీంద్రుఁడు నిన్ననుసరింప వచ్చుచున్నాఁడు.

[అప్పుడు నారదుఁడు ప్రవేశించి]
(14వ కీర్తన)

నార— కవిరాజ విరాజితము.

నరసిజలోచన! సద్గుణభూషణ • సన్మునివంద్య! సనాతన! శ్రీ
కర! కరుణాకర! కాంచనచేల! వి • కారవిదూర! పరాత్పర! సుం
దర, ధరణీధర! తల్ప! సురారి వి • తానవిదారణవారణ పో
మ, రిపుక్షయంకర! శారదహీరతు • షారపటీరమరాళయశా.

ఋతు—మునివర్యా! నమస్కారము. ఈ యుచితాసము నలంకరిం
పుఁడు.

నార—ఋతుధ్వజా! ప్రకృతము నీ ముఖచిహ్నములంజూడ, నేదో
యొక గతించిన కార్యమునకై విచారించుచున్నట్లు తేటపడు
చున్నది. ఇది నిజమేనా.

ఋతు—మహాత్మా! మీరు త్రికాలవేదులు. మీకు తెలియని
యంశము లెందుండును? అదినేను వేఱుగాఁ జెప్పవలయునా?

నార—నీవు చెప్పనక్కఱలేదు. నీ ముఖలక్షణములే చెప్పుచున్నవి.
ఓహోహో! నీ యౌదార్యము, నీ శేముషీమహిమ, యెం
దఁబోయినది? పిచ్చివానివలె గతించిన కార్యమునకై యెంత
యు శోకించు సోలుచున్నావే. బాగుబాగు. ఋతుధ్వజా!
నిన్నుఁజూచి నాకు మందహాస ముదయించుచున్నది. సతికై
యిట్లు వగనొందనేల వగనొందినవారు సయిత మెంతకాల
మీభూమిపై మని యుందురు?

ఋతు—నారదమునిచంద్రమా! మీరు త్రైలోక్యవేదులైనను మద
నసాయకా సంస్కారము ననుసరించి, యిప్పుడు మీ వచనం
బులు పడిపోయిన గోడకు సున్నపుపూతఁ బూసినట్లు నిరర్థక
ముగా నుండెను. సంసృతిక్లేశపాశబద్ధుఁడనగు నన్నే విధమున
నూరార్చఁగలరు?

నార—అవును సంసృతి క్లేశపాశబద్ధుల నూతార్చుట కష్టమే. అందు రాజులమాట చెప్పనేల? ఋతుధ్వజా! నేనొక యుపాయముఁ జెప్పెదను. అటులొనర్పఁగలవా?

ఋతు—చిత్తము. ఆజ్ఞాపింపుఁడు.

నార—నే నిప్పుడు కైలాసంబున కేగి వచ్చుచుంటిని. అక్కడ పార్వతీదేవి, మదనసాయకంగూడి యిష్టానుసారముగా విహరింపుచుండెను. నీ సతీతిలకము పరమేశ్వర వరప్రసాదలబ్ధయగు యువతీలలామ ఆమెతండ్రి పరమేశ్వరుఁగూర్చి తపంబొనరింప నద్దేవుండు ప్రసన్నుండై పుత్రికా సంతానంబొసంగి త్వరలో నాతని సాన్నిధ్యమున కామెం జేర్చుకొని పోయెను. మరల నీ భార్య నిన్ను జేరవలెనని యెంచితివేని యా దేవదేవు నారాధింపుము. అతఁడు పరమ దయాళుఁడు. భక్తజనాభీష్టప్రదుఁడు. తప్పక నీ యభిలషితం బీడేర్పక మానఁడు. ఈ కార్యము నీ వలన గాకపోయినను, వేరొకరిం బ్రార్థించి, వారివలన సానుకూలము గావింపుము. ఇది దైవికంబునఁగలిగినదికాని, యింకొకవిధమునఁ గలిగినదని యెంచుకొనుట దుర్లభము. ప్రతికార్యమునకును దైవయత్నముండక తీరదు. అట్లుగాక నేనేయని చేసినవారు కేవలము తెలివిహీనులు. వారి వాదోపవాదములు తృణప్రాయములు. నే నరుదెంచి చాలసేపయినది. ప్రదోషకాలము కొంకపూర్వమే వికుంఠుని తో మాటలాడబోవలయును. ఇంక నే నేగెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

శోక—(విశోకునింజూచి) విశోకా! నారదునిమాటలు వినుచుంటివి కదా! ఇటురమ్ము (అనిలేచి)

సీ. ఘనమైనశ్రీపెంపెసం • గంగఋతుధ్వజుంగూడి
యింతకాలము హరి • యించినాము
మననిజాకృతులను • గనఁబర్చకయె విప్ర
వేషముల్ వేయుచు • వెలసినాము
నాగలోకమునుండి • నరలోకమునఁజేరి
మదికింపుజెలఁగంగ • మసలినాము
రాచబిడ్డఁడటంచు • దోఁచినమాత్రాన
సంచితంబు గఁగొర • వించినాము
గీ. అయ్యయో యిట్టి మిత్రుని • యాపదాబ్ధి
నెట్లుదాటింపఁగలము మ • జేటుసేయఁ
గలము? నిజపురికింజన • గలమదెట్లు
మనము దుఃఖాబ్ధిసేఁదుచు • మనఁగవలసె.

విశో—అన్నా! ఈ మాటలేల? ఎవరయినం దపోమహిమచే మదనసాయకు ప్రాణవాయువుల మరలఁ దేగలరని నారదమౌనీంద్రుఁడాలోచించి యుండుటలేదా!

గీ. మనజనకుఁడాత్మశక్తి సా • మర్థ్యపరుఁడు
శైవభక్తుండు, కీర్తి వి • శారదుండు
తపమొసర్చిన సాఫల్య • తను వహించి
మదనసాయక ప్రాణముల్ • మరలఁదెచ్చు.

కాబట్టి, వెంటనే మనము గిమ్యస్థానమునకేగి, యొకానొక కార్యమునకై దివులుఁజెందియున్నట్లు తండ్రియెదుట నిలచి యుండెదము. కారణమేమని యడిగిన నీ విధానమంతయుఁ బూసగుచ్చినట్లు దెల్పి పట్టినపట్టు విడువక యుండెదము.

శోక—ఈ యుపాయము మంచిదేకాని, మన యిరువురియభిప్రాయమొక్కటియై యుండవలయును. భిన్నాభిప్రాయులమైతి

మేని విఫలులమయ్యెదము. ఏలోకమందైనను, పాలితులందఱు నొక్కమాటయే యాడిన పాలకుఁడొక్కఁడేమియు ననఁ జాలక వారి మనంబుల ననుసరించి వర్తించును. గాని, ఐకమత్యమొక్కటి దృఢపడనిదే యేదేశమయినను తప్పక నశించును. అందువలననే ప్రతివారి హృదయములందును వ్యతిరేకోపాయములు జనించుచుండును. ఒక మంచికార్యమైనను చెడుకార్యమైనను పదుగురుంగలసి, ఏకగ్రీవముగా మాటలాడి యొనర్చిన నది లభింపక మానునా? ఇప్పుడు నేఁ జెప్పిన చొప్పునఁ బ్రవర్తించెదమేని మన తండ్రి యనురాగమునకుఁ బాత్రులయ్యెదము.

విశో—ఏమీ? నే నెన్నఁడును నీవుచెప్పినచొప్పునఁ బ్రవర్తింపలేదా? ఐకమత్యము కుదిరిన నెట్టి దొరతనమునైనను సులభోపాయమున సంపాదింపవచ్చుననుట నాకుమాత్రము తెలియదా! ఇఁక నీమాట నతిక్రమించెద నేనియొట్టుఁ బెట్టుము.

శోక—సరియే అటులయిన మన యుద్యమము నెఱవేరనగును. రమ్ము (ఋతుధ్వజునింగాంచి) మిత్రమా!

చ. పనివడిమూర్ఛఁజెంది బహు • భంగులఁజింతిలకన్న నేఁడు మా జనకుని చెంతకేగి బలు • సారులు వ్రేల్మిడి మ్రొక్కి మీసతీ మణిని గ్రహింపగల్గుటకు • మంత్రములం జదివింతుమన్న వేఁ జనిమొదమన్న నీ మదిని • సంతసమేర్పడనుండు మన్నరో!

ఋతు—నిజముగా మదనసాయక ప్రాణములువచ్చునా?

శోక-విశో—రాకేమి? నిరభ్యంతరముగా వచ్చును.

ఋతు—అటులయిన, మిత్రులారా! మదీయకార్య మెట్లు నిర్వహింతురో మీదేభారము.

శోక—మిత్రుని కార్యము శిరసావహించి చేసెదము పోయివచ్చెదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

[యవనిక పడును]

గద్యము. ఇది శ్రీ రామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవిత్వ.
గాంగేయగోత్ర పవిత్రాల్లంశెట్టి వంశపయః పా
రావార రాకాసుధాకర, సూరనాఖ్యతనూ
భవ, సూరమాంబాగర్భశుక్తిముక్తాఫల,
సకల సుధీవిధేయాప్పయనామధేయ
విరచితంబైన మదనసాయక నాట
కంబునందు చతుర్థాంకము
సంపూర్ణము.



# మదనసాయకనాటకము.

## పంచమాంకము.

ప్రదేశము :- నాగలోకము.

[ప్రవేశము అశ్వస్థుఁడు, శోక విశోకులు.]

అశ్వ—ఆహా! నేఁడేలకోగాని నా కుమారులిరువురు శోక విశోకులు, శోకసంతప్తమానసులై రిచ్చపాటున నిలువఁబడి యుండిరే. వీరిట్లు సంతాపము నొందుటకుఁ దగిన కారణమేమై యుండునో కదా! నే నిదివఱకొకప్పుడు వీరిపైఁ గోపించియుండ, అప్పుడయినను నాయందించుకేనియు భయభక్తులు తప్పక సంచరించుచునే యుండిరి. వీరిట్లు విన్నవదనులై యుండుటకుఁ గత మేమి చెప్పుమా? వీరినెవ్వ రేమనిరో! ఎవ్వ రేమనఁగలరు? సమధిక శాస్త్రలక్షణ లక్షితుఁడనగు నా నామోచ్చారణ మాత్రమున, లోకంబులు బెగ్గిలంబొందుఁగాని యుపక్రోశ మెవరొనరింపఁగలరు? అటుకాదు వీరి మనస్తాపంబునకుం దగిన కారణమేదియో వీరివలననే తెలిసికొనియెదఁగాక. (ప్రకాశముగా) తనయులారా!

చ. అమితవిచారమేల? హృద • యంబుల భీతిలనేల? నుత్తమాం
గములటు వాంచనేల? పలు • కంగ వితర్కమదేల? పుత్రులా
ర! మిము దురంతశోకవన • రాసినిముంచిన నీచమానసుల్
సమయఁగఁజేతు, దుఃఖమును • సైచియు హాయిగ మాటలాడుఁడీ.

శోక-విశో—(ఊరకుందురు)

అశ్వ—కుమారులారా! సదుత్తరమీయరేల?

గీ. త్రిభువనాభీలమగుచు మ • దీయకోష
వహ్నిదహియింప, నెదిరిరా • వాసవుండె
కొండలంబందుచుండును • ముందువచ్చు
చేటెఱుంగక మిమ్మిట్లు • జేసెనెవడొ.

మీ మనస్సును నొప్పించి విషాదమొందించినవాని నా కెఱిఁగింపుఁడు. వైరివార సంక్షోభమగు నస్మదీయ రూక్షేక్షణ విశిఖాపరంపరౌద్ధత్యమున వాని హతమొందించెదను. అటు కాదేని మీతలం పెద్దియో యెఱిఁగింపుఁడు తప్పక దాని దీర్చెదను.

శోక-విశోక—(అంజలిమోడ్చి) జనకా! నిరుపమాన విద్యానిధులగు మీరుండ, మమ్మెవ్వరేమని యనఁగలరు?

అశ్వ—అటులయిన మీ విచారమెందుకు గలిగెను? మీ యభీష్టమెయ్యది?

శోక—మాయభీష్టమీడేర్చెదనని వాగ్దత్తమొనరించిన, విన్నవించువారము.

అశ్వ—(మందహాసముతో) ఓహో! బాగుగా నడిగితిరే! తల్లిదండ్రులు కుమారుల యభిలషితంబు నెఱవేర్చి, వారి నానందింపజేయుటకంటె నేఱు భాగ్యమెందున్నది? కుమారులార! సంకోచింపక మీ యభిప్రాయముఁ దెలియఁజేయుఁడు. అది తప్పకఁ గొనసాగించెదను.

శోక—(విశోకునితో) తమ్ముఁడా! ఇప్పుడు మన మైకకంఠ్యముగా మాటలాడమేని కర్జంబుగాదుసుమా!

విశో—అవును. మనమనుకొనినట్లే చేసెదము.

శోక—జనకా! ఆకర్ణింపుఁడు.

సీ. భూలోకమున నొక్క • భూపాలపుత్రుండు
మాకునెచ్చెలిగాఁగ • మసలెనయ్యా!
విశో—ఆతఁడు మదనసా • యక యనురాబిడ్డ
నానందమునఁ బెండ్లి • యాడెనయ్యా!
శోక—కుటిలవృత్తినొకండు • క్రూరుఁడామె వసించు
సంతిపురంబున • కరిగెనయ్యా!
విశో—మదనసాయకనేఁడు • మరణించె నీపతి
యనుచుఁ దిరోహితుం • డయ్యెనయ్యా!
శోక—గీ. వరుని మృతి వించు ప్రాణముల్ • వదలెనయ్యా
యామె, వేగఋతుధ్వజుం • డరుఁగుదెంచి
విశో— యింతికై యెంతయుం బ్రొద్దు • యేడ్చెనయ్యా!
కార్యసాధనమునకీవు • గడఁగుమయ్యా!
అశ్వ—ఓహో! ఇందుగఁఱింటియే మీరింత విచారించుచుంటిరా?
అయిన నేనిప్పుడేమి సేయవలయును!
శోక—మీకు కొంచెము కష్టమొసరించినందులకు క్షమింపుఁడు.
అస్మన్మిత్రుని జాయపరమేశ్వరు సన్నిధానమున నుండెను.
ఆమె పరమేశ్వర వరప్రసాద సంజనితయగు యువతీలలామ.
ఎట్టులైన నా జగదీశ్వరు ననుగ్రహంబువడసి యనుకంపాయ
త్తచిత్తుండవై యామెను ఋతుధ్వజున కొసంగుదురని మా
యభిప్రాయము.
విశో—తండ్రీ! ఏవిధముచేతనయిన, మదనసాయకంబునర్జీవితురా
లుగా నొనరింపనియెడల మా మిత్రుని విచారముసైరింపఁ
జాలము. మాకువానితోడిదే యీ లోకము. వానితోడిదే యీ
సంచారము. వానితోడిదే యీ జీవనము.
శోక—వాని తోడిదే యీ కళేబరము.

అశ్వ—(ఆశ్చర్యముతో) అబ్బా! ఎంతపట్టుదలవహించితిరి? మీరి రువురిట్లు బలికెదమని గుమిఁగూర్చుకొని యుంటిరి కాఁబోలు తనయులారా! పరమేశ్వరు నారాధించిన నామె పునర్జీవితు రాలగునని మీకెట్టినమ్మకము? ఎవరు మీకు చెప్పిరి? ఇట్టి గొంతెమకోర్కెలా వలఁగట్టి పట్టుదు. గతించినవారు మరల వచ్చెదరనుట గగనకుసుమము కాదా! బాలురగుటచే వెట్టి మొగముఁబెట్టికొని నాయెద్ద నిట్లు వెలిబుచ్చసాగిరి. యింకొ కరిట్లు పలుకఁగలరా?

గీ. మరణమొందినవారలు • మరలవచ్చు
ననుచుఁ బలికిన మీమాట • లద్భుతంబు
గాదె! యే లోకమున నిట్లు • గలుఁగఁగ
యేల యూరేలఁబలికెద • రిటులమీరు?

శోక—తండ్రీ! మేమెరుఁగుదుము. ఆమె పునర్జీవితురాలగుననుట మా కెట్టి నమ్మకముంటిరేని.

ఉ. నమ్మకమేల చెప్పెదను • నారదమౌని వచించియుండఁగా

విశో- నమ్మకమేల చెప్పెదను • నాయన నీ వొకరుండవుండఁగా

అశ్వ—(నవ్వుచు) ఔరా! పెద్దవాని పట్టుదలకంటె! నీ పట్టుదలయే యెక్కువగానున్నది. కానిండు, మీ యభిప్రాయమేల వ్యర్థ ముకావలెను?

ఉ. నమ్ముఁడు బాలురారమని • నమ్మెద నీశ్వరుపాద పద్మముల్
సమ్మతినేగుఁడీ మరల • సాయక తెచ్చెద నెన్నిభంగులన్.

కాఁబట్టి, మీరింటికేఁజని భోజనముచేసికొనిరండు. నేనింతలో నీశ్వరునారాధించి, తదీయ కటాక్ష వీక్షణంబునకుఁ బాత్రుఁ డనై మనసౌఖ్యకం దేఁగలిగెద.

శ్లోక-విశో— (నమస్కరించి) ఉదకా! చిత్తము. మే మిదేపోయి వచ్చెదము. (నిష్క్రమింతురు)

అశ్వ—(తనలో) అహా! నేఁ జేయు బూనిన పరోపకారము నిరస్త్రులోకమునకు వెల్లడియగుఁగాక. (అని దేవుని ధ్యానించి) పరమేశ్వరా!

సీ. పురుహూతముఖసుర • మునిబృందవందిత
    పాదపంకేరుహ • పార్వతీశ!
వేధవై సంప్రీతి • విశ్వమంతయు నీవ
    నిర్మింపుచుందువు • నేర్పుమీఱ
జలజోదరుండవై • సకలచరాచరం
    బులను గాపాడెదు • వెలమిఁజెలఁగ
శూలివై సంహార • కారణుండవగుచు లోక
    జాలముల్ మర్దింపఁ • జాలుదీవు
గీ. పంచభూతాత్మకుండవై • పరగు నీవు
వాఙ్మనసగోచరుండవై • వఱలుచుండు
నట్టి నీ మహిమంబు • నభినుతింపఁ
దరమె శంకర! కైలాస • ధరనివేశ!

(15వ కీర్తన)

పరమేశ్వరా! దయామయా! భక్తహృత్కుశేశయమార్తాండ!

చ. పరమదయాకరా ప్రథిత • శశాంకధరా! హరా! ధరా
ధరవర కార్ముకా! సకల • ధన ప్రకరావన! లోకపావనా!
కరుణ మదీయ ప్రార్థనము • గైకొనియున్ భవదీయ దివ్యసుం
దరతర విగ్రహంబునను • ధన్యునిఁ జేయఁగఁ జూపు మీశ్వరా!

[అప్పుడు ఈశ్వరుఁడు ప్రవేశించి]

(16వ కీర్తన)

ఈశ్వ—ఓయీ! అశ్వత్థుఁడా!

ఉ. ఏమికతంబునందలంచి • తీవు ననుంబ్రియమందంబెలర్ప నీ
కేమికొఱంతవచ్చె మది • నేమి యభీష్టముం గోరనెంచితో
నేమముమీర నా కిపుడె • జెప్పుము దానినొనర్తు నస్మదీ
యామల పాదపద్మముల • హర్నిశమెన్నిన నీవులాంతివే?

కావున నీ యభిమతార్థంబెద్దియో నా కెఱింగించుము. నీ యట్టి భక్తాళుల వాంఛితంబులీడేర్చుటకంటె మాకు వేఱొండు కర్తవ్యమెందుగలదు? నేను నీ యెడల దయార్ద్రీభూతచేతస్కుఁడనై యుండ నీకేమి లోపముకలుగును?

అశ్వ—ఓ మహేశ్వరా! దీనదయాళో! నిగమగోచరా! నీవు నా యందు దయదలఁచి ప్రసన్నుఁడవైనందులకు నా కెంతయు సంతోషము. నా ప్రార్థన మొండుగలదు. భూలోకంబున ఋతుధ్వజుఁడను రాజకుమారుఁడు మదీయ పుత్రులకుఁ బరమమిత్రుఁడు. ఆతనిపడంతి భవద్వరప్రసాద లబ్ధయగు మదనసాయక. ఆమె పతిరాక్షసులచే గతించెనని యొక కుహనా పరివ్రాజకుని మిథ్యావాక్యంబులు తథ్యమని నమ్మి, ఘోరున నేడ్చుచు నేలగూలి ప్రాణములు విడిచెను. ఆమె ప్రాణవాయువులు భవత్సాన్నిధ్యమునఁ జేరియుండెనని, నారదునివలన దెలియఁబడెను కావున నన్ను భవదీయ పరిపూర్ణ కటాక్ష వీక్షణ సుధారస ధారలచేఁ దనియంజేసి, యామెం దయసేయ ప్రార్థించుచున్నాఁడను.

ఈశ్వ—(మందహాసము నభినయించి) అయ్యా! మదనసాయక కైలాసంబున నుండెనని నీకెట్టి తార్కాణము?

అశ్వ—నారదుని మాటలే నిజమని.

ఈశ్వ—(తనలో) అబ్బా! ఆ యారివేరము తబిసిరాయఁడెప్పుడు నిట్టి పనులే చేయుచుండును. (ప్రకాశముగా) భక్తాగ్రేసరా! అటులైన,

ఆ. వె. నీవుకోరినటుల • నిజము నాసన్నిధి
నున్న•యన్నులమిన్న • నోసగువాఁడ
సంశయింపవలదు • సద్భక్తవర నేఁడు
నీతపఃఫలంబు • నిండెనయ్య!

ఈశ్వ—ఇదిగో! ఆమెయిప్పుడే వచ్చుచున్నది. (అనినిష్క్రమించును)

మద—(ప్రవేశించి ఆతురముతో) హా (ప్రాణేశ్వరా! (అని పడును)

(17 వ కీర్తన)

చ. అతులితభక్తితావక ప • దాబ్జములన్ని రతంబుఁగొల్చు నీ
యతివపయిం గృపారసము • నా నిమొగంబిటు జూపవేమి నా
గతియిటుజేసెదే మకట • కానకు రాక్షసులన్ వధింప నే
గితివట నేమిమూఁడిసదో • కేవలహీనసనెఱుంగనైతి హా!

(పరికించి) ఏమి? ఈమాయ. ఇది ఎట్టి వింతగనున్నదే. నే నిప్పుడెక్కడ నున్నదానను? ఎక్కడనుండి వచ్చితిని? నా ప్రాణేశ్వరులెక్కడ? ఈభవన మెవ్వరిది? ఇదిమనుష్యలోకమా?

చ. కనవినరాని వింతయిటు • గన్పడెఁ బెంతునదేలకో సుహృ
జ్జనవినుతుండు నాథుని • జాడయెఱుంగఁడయెందుఁజదక్కటా!
దనుజులమాయచేత విది • తంబుగనేనిటుఁ జేరియుంటినో
మనమున నేమెరుంగకటు • మాంత్రికుఁడీయు బెట్టిసిదేమి చిత్రమో.

హా! నాథా! నేనుభవదీయ దివ్యమంగళ విగ్రహంబు, కన్నులారఁ జూచుభాగ్యము నోచనైతినికదా! యేమిసేయుదు? ఇఁక గత్యంతర మేదికలదు? (అని కన్నీరు నించును)

(అప్పుడు శోక విశోకు లిరువైపులనుండి ప్రవేశించి)

శోక—

ఉ. ఏడువకమ్మ! నీధవుని • కెందు నభేద్యము లేమసుమ్మ యా
పోరిడహజారమ ందు సఖ • మున్నదనియుండుట తథ్యమమ్మ! మా

తోడనురాగదమ్మ! నినుఁ • దోడ్కొనిపోయెదమమ్మ! యింకయే
కీడునురాదు లెమ్మ! పరి • కించియుమాటెనఁ జూడుమమ్మరో!

విశో—

ఉ. సంతసమొందఁ గీగతి వి • చారమునొందిన లాభమేమి? నీ
కాంతుని సన్నిధానమిది • కాదు భయంపడ కింక వేట్కనీ
యంతి పురంబుఁ జేరఁ జను • మమ్మరొ! రాక్షసమాయయిట్లు నీ
కింతయొనర్చెఁగాని మఱి • యేమియులేదు దలంచిమూడఁగన్.

శో—అమ్మా! ఇది రాక్షస మాయకాదు. బాగుగా జ్ఞప్తికిఁదెచ్చుకొని చూడుము. మేము నీ ప్రాణేశ్వరుని యనుంగు మిత్రులము అతఁడు మరణించెనని యొక నీచుండు పలుక నది నిజమని నమ్మి యాకస్మికముగ నీ ప్రాణభంగ మొనరించుకొంటివి.

విశో—ఇదియే మేము నివసించెడి పుటభేదనము మా కాణాచియు నిదియే. దీనినే నాగలోకమని యందురు. ఈయన మా తండ్రి నీవు ప్రాణముల బాసినందులకు నీ ప్రాణనాథుం డమిత చింతాలతికా వృత చిత్తుండై యుండ, యాతని నూఱడించి, యెటులయిన నిన్నుఁ బునర్జీవితురాలుగా నొనరించెదమని యెంచి మదీయ జనకునిచెంతఁ బఱపి పరిదేవన మొనరింపఁ బరమేశ్వరు ననుగ్రహంబువడసి యాతఁడు నిన్ను తేఁగలిగెను.

మద—(అశ్వస్థునిం జూచి) మహాత్మా!

గీ. కపటమెఱుఁగక ప్రాణభం • గంబొనర్చు
కొనిన నా ప్రాణవాయువుల్ • కొదువలేక
మరల దయచేసినట్టి యో • మహితచరిత
మ్రొక్కెదు భవత్పదాంబుజ • ములకునేఁడు.

(అని నమస్కరించును)

అశ్వ—అమ్మా! నీకు స్వాగతము. నీవు సాధ్వీమతల్లివి. నీ పతిశీఘ్రి ముగ౯జని, నీ నాథునిచింతఁదీర్చి సంతోషముననుండుము.

మద—(శోక విశోకులతో) అన్నలార! నాఁ డరణ్యంబున మన్నా థునితో నిర్వ్యాతుకముగ సాప్తపదీన మొనరించి రనుకొంటినే గాని, యిప్పుడది మహోత్కృష్టకార్య మొనరించినది. మీ తండ్రిగారి యప్రతిమాన శేముషీమాహాత్మ్యము నేఁడు విస్ప ష్టమయినది. ఇంకఁ గాలవిళంబన మాచరింపక నా ప్రాణేశ్వ రుని సుందరవదనారవిందం మీక్షింపనిండు.

అశ్వ—కుమారులార! మీ తలంపు నెరవేఱినదికదా! మీరింక సశీఘ్రిగమనోన్ముఖులై యేగి, యీమెభర్త నీమెకుఁ గను పరచుఁడు.

శోక-విశో—జనకా! చిత్తము. (మదనసాయకం జూచి) అమ్మా! ఈ వృత్తాంతమంతయు నీ నాథున కెఱింగింతము రమ్ము.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

## ద్వితీయరంగము.

—:0:—

ప్రదేశము:—ఋతుధ్వజుని శయ్యాగృహము.

[ అంతట ఋతుధ్వజుఁడు ప్రవేశించి విచారముతో ]

ఋతు—(తనలో) ఆహా! నేఁడు నా సతీవియోగమునకంటె విశేషిం చి నా మిత్రులయెడల వాత్సల్యత నంకురించుచుండెను. నేను మదనసాయకకై విచారింపుచుండ, దుఃఖోపశమనముకై మర ల నామెం దీసికొనివచ్చెదమని నా మిత్రులు చెప్పియుండిరే

గాని, నిజముగా మరణించినవారిం బునర్జీవితులుగా జేయు నెవరితరము? అది దుస్సాధ్యముకదా! ఒకవేళ సాధ్యమైన యెడల నింతవఱకు వారిచ్చుటకు రాకయుందురా? లేదు లేదు. వారివలన నీ కార్యమీడేరమింజేసి, యింక నా మొగ మెట్లుజూపుదుమాయని, విచింత్య మానమ్లానసులై రాజాలక పోయిరి. అయ్యో! నే నెంతటి యకించనుఁడను—

ఔరా! ఈప్రపంచమునం దొకరిమాట నొకరు నమ్మినఁ ద ప్పక మోసపోవుదురుకదా! ఎంత బంధువులైన నేమి? ఎంత ప్రాణమిత్రులైననేమి? ఏవిధమునైన మనసహాయకం దెచ్చి యిచ్చెదమని చెప్పి చనిన శోకవిశోకులవార్తయే తెలియ కున్నది. మఱియుఁ బ్రతిదిన మిచ్చుటకు వచ్చెడివేళ యతిక్రమించినది. నావివేక హీనతచే వారిమాటల విశ్వసించినం దులకు బాగుగా నొనర్చిరి. అన్నా! లోకములోనెట్టి మిత్ర ద్రోహులుందురు?

ఆ. వె. మంచివారికరణి • మాటాడుదురుగాని
మనమునందు కపట • మునువిడువరు
ధూర్తజనుల కిదియె • తొలుదొల్త నుగ్గుతోఁ
బెంచినట్టి విధము • పృథ్వియందు.

ఎవరిననుటకుఁ బనిలేదు. ఒకరి యదృష్టమున కింకొక రేమి చేయఁగలరు? హా! హతవిధీ!

చ. సతి గతియించెసంచునె వి • చారము నా మదినాటియుండఁగా
హితులనుబాయజేసితి వి • సీ యిదిచెల్లునె యెండవేడిమిఁ
మతిచెడఁగంట దుమ్మువడి • మైఁదపియించిన దేహప్రక్రియఁ
హతవిధి కష్టకాలమున • నన్నియుఁ గష్టములే ఘటియించెదా.

[అప్పుడు శోకవిశోకులు ప్రవేశించి]

శోక—మిత్రరత్నమా !

ఉ. ఏమిటికై విషాదము వ • హించెదు మిత్రకులావతంసమా
సోమనిభాస్య నీయువతి • సుస్థిరతన్ యిటువచ్చుచుండె నీ
కేమికొఱంతగల్గు హృద • యేశ్వరిఁగూడి నిరంతరంబు సు
త్రామసమానసౌఖ్యముల • రాజిలుచుండుము ధారుణీస్థలిన్.

విశో—అసమాన శౌర్యధైర్య భుజబల ప్రతాపధౌరేయుండవును, మహాభాగధేయుండవును, సమంచిత నీతిపారంగతుండవును, నగు నీవు మాయంతరాత్మంబు బరిశీలింపక మాయెడఁ గినుకి వహించి యేమేమో యనియుండిరి. ఇప్పుడైనను మన్నింతు రుగాక.

ఋతు—(లేచి) అకలుషమనీషులార! కించిజ్ఞుండనగు నేను మీయం దతిక్రాంతమర్యాదుండనై యిదివఱ కేమనినను క్షమియిం పుఁడు. మీరేగినకార్య మేమయినది? ఏదీ నా ప్రాణపత్ని మదనసాయక ?

శోక—అయ్యా! శెసనెంచి రచులడుగనేల? అదిగో! ఆవైపు జూడుఁడు.

[అప్పుడు మదనసాయక ప్రవేశించి]

మద—హా ! నాథ ! (అని ఋతుధ్వజుని చేరంజని)

(18వ కీర్తన)

గీ. విధివశంబునఁ బ్రాణముల్ • విడిచి మరల
ధన్యనైతి భవత్పాద • దర్శనమున
ప్రాణనాయక ! మిముఁజేరు • భాగ్యమబ్బె
నహహా ! నానోముఫలిత మే • మందునయ్య ?

మీరు నిర్నిమిత్తంబ నిశాచరులచే విగతాసులైతిరని యొకా నొక యసంబద్ధ ప్రగల్భుని మిథ్యావాక్యములు నిజమని నమ్మి నేనింక పృథ్వీతలంబునఁ బ్రాణంబులతో మనియుండిన నేమి ఫలితమని, పరమేశ్వరీకైంకర్యమునకై కైలాసంబునకుం జని, యిమ్మహామహుల తండ్రిగారగు దర్వీకరేశ్వరుని యనుపమాన కరుణారసంబునంజేసి, పునర్జీవితురాలనై తొంటిచందంబున భవదనుంగు జాయనగు నే నిదే నమస్కరింపుచున్నదాన. (నమస్కరించి) ప్రాణేశ్వరా? సత్యాసత్యము లెఱుంగక తమనుమోసపుచ్చి నే మోసపోయిన నా యవివేకమును మన్నింపుఁడు.

ఋతు—యువతీమణీ.!

సీ. పున్నమజాబిల్లిఁ • బోలు నీ నగుమోము
కాంతరోముదమార • గాంచు టెపుడొ
పైకముందెగడు నీ • ప్రిముదిత వాక్యముల్
వీనులకింపుగా • వినుట యెపుడొ
వల్లరీవిభవమా • వలఁదోఁ యు నీ బాహు
వులఁబట్టి విహరింప • బొసఁగు టెపుడొ
చకితసారంగ శా • బకనేత్రిరో నీదు
చూపులు తూపులై • సోఁకు టెపుడొ

గీ. అనుచు నెడతెగకయె నేన • హర్నిశంబు
చిత్తవిభ్రమమునఁగడు • చింత సేయ
నిమ్మహామహులే తెంచి • యిపుడు నిన్ను
నా కొసంగినకతన నా • నందమయ్యె.

మఱియు, నీవు మదీయ వియోగంబునం జేసి, ప్రాణములు విడిచి వీరి తండ్రిగారి యనుక్రోశంబువలన మరల నీ తావున

కెట్లువచ్చితివి? అతఁడెట్లు నిన్ను తేఁగలిగెను? ఆయన నివ సించు పురమెయ్యది? ఏమి పనిచేయుచుండును? నిజముగా భూదేవకులజుఁడా లేక మఱి యెవ్వరు?

మద—నాథా! ఆ వృత్తాంతమంతయు నన్నడుగనేల? యుష్మన్మి త్రులగు నిమ్మహాత్ములవలననే సర్వంబు నెఱుఁగవచ్చును.

ఋతు—మదీయ హృత్కుశేశయమిత్రులారా! మిత్రులార!

గీ. వినఁగఁ గౌతూహలంబయ్యె • మనమునకును
నీ యుదంతము మఱియును • మీ యుదంత
మును గ్రమంబుగ దెలుపుఁడు • మనమలరఁగ
మిత్రులార జనస్తుతి • పాత్రులార!

శోక—మిత్రమా! మిత్రకులాభరణమ! ఆకర్ణింపుఁడు మేము నాగ లోకమున కధిపతియగు నశ్వస్థుని తనూభవులము.

ఋతు—(ఆశ్చర్యముతో) అబ్బా! అటులయిన మీరు పన్నగులా? సరియేకాని, యీ గోత్రామరాకారమున భూలోకమునకు మీరేల రావలయును? అటుల వచ్చుటవలన నేమిప్రయోజ నమూహించిరి? మీరు నిజముగా పరోపకార పరాయణత్వ మునకై యిట్లు జరించుచున్నారని నా నమ్మకము.

శోక—అనాదిసిద్ధముగ మేము మానవులతో మైత్రిసల్పి, వారికిం గ లుగు క్లేశంబుల నాశంబొనర్చి సంతోషితస్వాంతులుగ నొన ర్చుటయే మాకు పరమావధి.

విశో—పన్నగాకారములతో నుండిన మైత్రి పొసఁగదని, విప్రాకార ములఁ దాల్చినారము.

ఋతు—అదియంతయు నామేలుకొఱకే. మహాత్ములార! మీరు నాకొనరించిన మహోపకార మెంతయు శ్లాఘాపాత్రము. కావున.

పంచమాంకము.

మ. కర్తలో సైన్యములో యమూల్యమణులో • గ్రామంబులో నూతనాం
బర సంభావనమో మదీయమగు సా • మ్రాజ్యంబొ వాంఛింపుఁడీ
పరమామోదముతో నొసంగెదను మ • ద్భావంబు రంజిల్లఁజే
సిరి నాపూర్వఫలంబునం గలిగె మీ • స్నేహంబు పాకంబుగన్.

విశో—మిత్రమా! అవియన్నియు మాకేల? అత్యంత ప్రీతిదాయక మగు మీతోడి మైత్రియే మాకుఁ బరమోత్తమము. కావున;

గీ. ఎంతయుం బ్రీతితోడ ని • రంతరంబు
మమ్ము మీ రెడఁబాయక • మిమ్ము మేము
వేఱుగాఁ దలపోయక • విడువనట్టి
చెలిమిమాత్రమె మాకుఁ గా • వలయునధిప.

మద—మనోహరా! మీరు లఘూపాయమునైనఁ జేయకయే లభించిన యుత్తమోత్తమమగు వీరిమైత్రి నవలంబించి యనుమోదింపుఁడు.

ఋతు—స్నేహితులార! మీకును నాకునుఁ గల యన్యోన్యమైత్రి యెన్నఁటికిని బోవునది కాదు. మీరొనరించిన యుపకారము నాకత్యంత సంతోషదాయకము. దానిని నేనెన్నఁటికి మఱచువాఁడను గాను. ఇది యంతయు మా తండ్రిగారి కెఱుకపరచి వారి నానందింపఁజేయుఁడని యర్థింపుచున్నాఁడను.

శోక-విశో—మంచిది. అటులే గావింతము.

(అందఱు నిష్క్రమింతురు)

[యవనిక పడును]



# తృతీయ రంగము.

—:o:—

ప్రదేశము:—అయోధ్యాపురము

[ప్రవేశము, శత్రుజిత్తు, ఋతుధ్వజుఁడు, వసిష్ఠుఁడు వినీతుఁడు, శోక, విశోకులు.]

శత్రు—ఆచార్యప్రధానులారా! ఈ విప్రవేషధారులగు నాగకుమారులు, మదీయస్నుష నొసంగి నాప్రియతనూజు నమందానందసాగరంబున నోలలాడించి, మన మనంబుల రంజిల్లఁజేసిన వీరిమహిమంబు కడుంగడు వర్ణనాతీతంబు. ఆహా! నేఁడుకదా! మదీయచ్ఛింతాత్వక్సారకుడుంగము లావఘాతంబైనది.

గీ. మీయెదుట నాతనూజు నీ ✦ మేదినీశుఁ
జేయనూహించి పట్టాభి ✦ షేకమిపుడె
వాసిమీరరయొనర్ప భా ✦ వంబునందుఁ
దలఁచియున్నాఁడ మీకోర్కెఁ ✦ దెలుపరయ్య?

అందఱు—తథాస్తు తథాస్తు.

వసి—శత్రుజిత్తుమహారాజా! ఇట్టి తరుణమున మన ఋతుధ్వజునిఁ బట్టభద్రునిగా నియమించుట యుక్తము. కాఁబట్టి శీఘ్రమే సంకేతములం జరిపింపుఁడు.

వినీ—సార్వభౌమా! భృత్యామాత్యగురుబంధు మిత్రజనంబులచే నిండియుండిన నీ కొలువుకూటమున నధిపతిగా మన ఋతుధ్వజుని నియమించుట, సర్వశుభదాయకము. కష్టనిష్ఠురములంబడి తమ యశోలతికాలవాలంబుల నభివృద్ధినొందించిన వారుకదా పూజ్యులగుదురు. అందు విషయమైనేను మున్నుందుగనే తమ మోప్రలనుగ్గడించి యుండలేదా?

శశు)—అవునది నిజమే. మీరు చెప్పినచొప్పున నేఁడే యొనర్చెద,

ను. (అని యభిషేకమహోత్సవము నడుపుదురు)

మ॥ పరిపాలింతురుగాక రాజులిల శం • భక్తి న్నత్యంతమున్
బరితోషింతురుగాక సత్కవులు భూ • పాలానుకంపంబునన్
వరుసన్ వారిధరంబు లీక్షితిపయిన్ • వర్షించు సద్భక్తిమైఁ
బరమేశున్ నుతియించి భూజనులు సం • పాదింతురర్థంబులన్.

(19వ కీర్తన)

(అందఱు నిష్క్రమించుచున్నారు)

గద్యము. ఇది శ్రీ రామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవిత్వ
గాంగేయగోత్ర పవిత్రాల్లంశెట్టి వంశపయః పా
రావార రాకాసుధాకర, సూరనాఖ్యతనూ
భవ, సూరమాంబాగర్భశుక్తిముక్తాఫల,
సకల సుధీవిధేయాప్పయనామధేయ
విరచితంబైన మదనసాయక నాట
కంబునందు సర్వంబును
పంచమాంకము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ.
శ్రీరామార్పణమస్తు.



# మదనసాయకనాటకము

నాటకారంభమున సమాజకులందఱుఁగలసి పాడెడిపాట.

1. బేహాగ్—ఏకతాళము.

మారసుందర రమావినోదా ॥మార॥
సారసాక్షసదమలచరణా ॥మార॥
క్రూరరాక్షస విఖండనా
సూరివందితా సుచరితా ॥మార॥
నీలనీరద సమానగాత్రా । నిఖిలలోకపోషణా
ఏలజాలమేలఁగా - దయాలవాల సురుచిరలీల ॥మార॥

2. నటి. కల్యాణి—ఏకతాళము.

సంతసమాయెనుగా వసంతము ॥సంత॥
పంతముతో మధు - పవ్రజములొగిఁ
యింతింతయనరాని - సంతసమున జెలఁగెఁ ॥సంత॥
మాకందంబుల - మఱిమఱి దినుచుఁ
వీకఁగుహూయంచు - కోకిలములు బాడెఁ ॥సంత॥
కాముకీజనుల్ - కాంతలతోడఁ
వేమరుసంప్రీతి - వెలయింపుచుండెఁ ॥సంత॥

3. శతృజిత్తు, మునులు డైలాగ్.

ఇంగ్లీషు నోటు.

మునులు—మునిజనావనలోల సరపాల - గుణశీల -
వినుము మాగోల యీలీల వినుము మాగోల
ఘోరాటవులలో - క్రూరరాక్షసుల

బారీ యే మందుమయ్యా మాయయ్యా
తాళ లేము.

శత్రు— అక్కటకటా !

మునులు—దయజూచి రక్షింపుమా

శత్రు— తాళుడికన్ - కూళలన్ - దండించి ఖండించెదన్

మునులు—ఎట్టులగాచెదో - యెట్టులజూచెదో - యేమైనమీాదయయే

4. ఋతుధ్వజుడు. ఇంగ్లీషునోటు.

తాళుడీ - తాళుడీ - ఏలనికన్ - ననటుగుంద మానులార ॥తా॥

దనుజుల్ - గినుజుల్ - దర్పితులైనన్

చనివేద్రుంతున్ - సమరమునందున్

మీాయలుకన్ - గనలేమనకన్ - పో - దామనకన్

యింతకష్టపెట్టినట్టి నీచగణము నిప్పుడె చెండెదన్ ॥తాళుడీ॥

5. తాళకేతుడు. బేహాగ్—ఏకతాళము.

పొగరెక్కినన్ను నగుబాటుసేయ

పగవాడెవండో యిటులరుదెంచె-

తగదటంచునే మదిదలపోయక - దర్పముజూపన్ - దండింతువెసన్।

ఆలమునందా కూళమానవుని

కాలునిదరికిన్ - మేలుగబంపెద ॥పొగ॥

నిరంకుశముగా నిఖిలవీరులన్

దురమునద్రుంచితి - సరిదియెయూతడు॥ పొగ॥

6 తాళకేతుడు, ఋతుధ్వజుడు. డైలాగ్.

తాళ—పో పో పో.

నాయెదుటన్ - నిలువలేవు నీచమనుజ ॥పో॥

చూడు నీకుకాలమిపుడె - గూడియుంటవచ్చినావు

నేడు నిన్ను మ్రింగెదరా - నిలువునిలువు నిలువులేక ॥పో॥

ఋతు—రా రా రా.

రణమున నిక్ - దుమిమెనరా - నీచదనుజ - వెఱువకిపుడు ॥రా॥
పొగరుమిగిలి యిటులబలుక । బెగడొందుదు నే దురాత్మ
వగవకిపుడు దురముసేయగ । తెగువగలిగి రక్కసుడా ॥రా॥

తాళ—అనవరతము మునికులముల । దినెడివృత్తి మాకు గలుగ
మనమునభీతిలక మమ్ము । కనలజేయవచ్చితివా ॥పో॥

7. ఋతుధ్వజుడు. భైరవి—త్రిపుట తాళము.

తెలసెలేదనుజ నీమాయ ॥తెల॥
అలసియుంట చెడిపోయియుంటివి ॥తెల॥
తులువ నిన్నువిడచెదనా యెం । దులకుబోయి డాగియున్న నిను
బిలుకుమార్చి మానివర్గమును । ప్రీతిచెనుపు దింక చూడరా ॥తెల॥

8. మదనసాయక. సింధుర—చతురశ్రగతి.

ఇంత ఘోరమా విధీ - ఏమి నా పాపమో ॥ఇంత॥
అంతటినృపునకే - నాత్మజనయ్యెదు
రంతచింతగుందగ - నయ్యోమునాకిక ॥ఇంత॥
కలుషమనక యా - కఠినాత్ముడు న
న్నలమటబెట్టి యీ - యడవిని డించెను ॥ఇంత॥
నేడో రేపోనన్నా - నీచుడు పెండిలి
యాడనెంచెనట - హా! యేమిసేయుదు ॥ఇంత॥

9. ఋతుధ్వజుడు. మోహన—ఏక తాళము.

ఔర! యీనారీవయ్యారి కుమారి - అందమైవిలసిల్లెగా ॥ఔ॥
ఇందు్రనీలములెన్న - నీ యింతిముంగురులు
చంద్రుడౌరా ముద్దుమోము
కుందరదన - మందగమన
కందర్పకతారిరా ॥ఔర॥

10. ఋతుధ్వజుడు. సింధుర—ఏక తాళము.

ఇంత కండకావర మింకేటికిరా - ఛీ! ఛీ! దురాత్ముఁడా ॥ఇంత॥
అంతరంగమున జాలిబూనకయె - సంతసమున నరుదెంచినావిసీ!
పంతముతో నిన్నాజిగూల్చినా । పౌ్రఢిమ నిదెజూపించెద దెలియ్యర॥
అబలామణి నిటుబట్టితెచ్చి యీ । యడవినివిడచితివౌర దుర్మతీ
నిబిడంబగు మచ్ఛరావృష్టిచే । నేఁడె నీదుపితృవ్యులజూపెద ॥నింత॥

11. ఋతంధ్వజుడు, మదనసాయక డైలాగ్.

ఋతు—వనితామణిరో మరువిరిశరముల। బాలికినోర్వను పలుకెలా॥వ
నినుజూచి నే మనమందునన్-ఘనమైనపేృమవిడువగజాలను॥వ
మద—ఇటు లాడగతగునా - ఇనకులతిలకా వెరువక ॥ఇటు॥
కుటిలాలకలుండు దరికి - చటుకున నరుదెంచిమరల ॥ఇటు॥
ఋతు—అతివా! వేయేలనింక - నాలింపుము నా మాటల్
క్షితీశపుతి్రనొటన్ - జేరినాడ నీ దరికిన్
మద—నీచ తాళకేతుడు న - న్నిటకుం గొనివచ్చెగాన
వేచనివానిన్వధింప - వేడుచుంటిమిమున్
ఋతు—అబలా యా తాళకేతు - డని లో దెగటారెను నీ
మదిలోపల సంశయంబు - మానుమమా ॥అబ॥
ముదముమీర నళివేణి - ముందుగ నీ కోర్కె దెల్పు
మదియేదైనన్ నిమేషమందు దీర్చెదన్ ॥అబలా॥

12. కమల, విమల, మదనసాయక డైలాగ్.

కల్యాణి—ఏక తాళము.

కమ—చూడ రేచెలుల్ - వనచోద్యమంతయున్
వేడుకతోనిందు మనము - విహరించెదమిపుడురారె ॥చూడ॥
విమ—ఇంతిచూడవే - చామంతిపుష్పముల్

వింతవింతలగుచు కుసుమ - సంతతులెల్లెడల దనరె ॥చూడ॥

మద—లోలలోచనా - సురసాలభూజముల్

చాలగలిగియుండె పరభృ - తాళికి విందొనరజేయ ॥చూడ॥

13. శోక విశోకులు. బేహాగ్ - ఏకతాళము.

ఏలయ్యా యింత ఘోరము దలచు ॥ఏల॥

చాలునింక, నీ విచార, మదేల ॥ఏల॥

ఈ యసిధారచే - నేటికిప్రాణము

బాయగనెంచితివో తెలియదు ॥ఏల॥

14. నారదుడు. బేహాగ్—ఏకతాళము.

కేశవ, మురవైరి, దామోదరా! నరహరి ॥కేశ॥

క్లేశనాశ - జగధీశ - శ్రీరమేశా

ఈశామాని హృత్కుశేశయనివేశ ॥కేశ॥

విహగవిమాన - విబుధజనావన

అహిపశయానాసురారాతిహరణ

సన్మృదుచరణ - సద్గుణభరణ

విన్యాస్మర్చితాఖిల - వీరవితాన ॥కేశ॥

15. అశ్వత్థుడు. ఏకతాళం.

నిగమగోచరాహారా! నీలకంధరా! ధరా

ధరధరనుతపదకమలా - సుమశరగర్వాపహారా ॥నిగ॥

హే-స-ర్వే-శా

కనికరమున నీ సురుచిరరూపము

గనుపరచియు నావరములనొసగుము ॥నిగమ॥

16. ఈశ్వరుఁడు. ధన్యాసి—ఏకతాళము.

చాలునశ్వసా - తపమిక ॥చాలు॥
ఏలాయీగతి ననుందలంచెదు
మేలుగూర్తు ద్వరలోనసె దెలుపుము ॥చాలు॥
అచ్చెరువుదోచె - హెచ్చైవెలసెను
మెచ్చితి వరముల - నిచ్చెద గొనుమిక ॥చాలు॥
నిరతమునూపద - నీరజంబులే
మరకదలంచిన - మాన్యుండవీవు
తపముసేయునంతటి కార్యము - దలపనెద్దియొ దెలుపుమిపుడె॥చాలు॥

17. మదనసాయక. హిం॥ తోడి—రూపకం.

ఆహా నా జీవితేశ - బాసిపోతివా ఆహా
అకటా - నన్ను - బాసిపోతివా ॥ఆహా॥
కలనైనన్ నీరూపము - గాంచగ నే నోచనైతి ॥ఆహా॥
సాటిలేని నీ బలము నిశాచరులచే జిక్కెనా
నేటితో నా నీరుణమ్ము - నీటఁగలసెనా ॥ఆహా॥

18. మదనసాయక, ఋతుధ్వజుడు. డైలాగ్.
బేహాగ్—ఆదితాళము.

మద—ఆహానాథా - అనుపమసుగ్గుణా
మోహనగాత్రి నీ - మోమిటుజూపుము ॥ఆహా॥
ఋతు—అన్నులమిన్నరో - ఆనందమాయెనా
కన్నులనినుబొడ - గాంచగగల్గితి ॥అన్ను॥
మద—చెనటిరక్కసుడిట్లు - జేయుటచేతను
ప్రాణేశా నా - ప్రాణముబాసితి ॥ఆహా॥
ఋతు—తరుణీమణిరో వి - ధాతవ్రాతదప్ప
దరమేయేరికి - వరులముమనము ॥అన్ను॥

## 19. మంగళ హారతి.

బేహాగ్—ఆదితాళము.

మంగళమిదె గొను - మా మనోనాథ
అంగజసుందర - హాటకచేల ॥మంగళ॥

గంగాధరనుత - కలుషవిదూరా
మంగళాకరా - మహిమోదారా ॥మంగ॥

సరసిజనయనా - జలనిధిశయనా
నిరుపమసుగుణా - నిత్యనిరంజన ॥మంగ॥

స మా ప్త ము.

శ్రీ రామార్పణమస్తు.



కాకినాడ. ఎ. పి. పి. వర్కు్సు యందు ముద్రింపబడియె. 1925.

